EACH POWER CAN BE UNLOCKED BY EATING THEIR FAVOURITE POPPINS. 10 POWERS: *SHAPE SHIFTER*- GREEN APPLE, *SPEED*-MANGO, *FLIGHT*-ORANGE, *GIANT*-WATERMELON, *STRENGTH*- RASPBERRY, *SHRINK*-LYCHEE, *INVISIBLE*-PINEAPPLE, *STRETCH*-MUSK MELON, *FISSION*-BLACK CURRANT, *FORCE FIELD*-GUAVA.

*RECAP*: RAM AND SHYAM RESCUE AN ALIEN - ZARTOSAARR, WHEN HIS SPACESHIP CRASHES TO EARTH. IN RETURN HE GIFTS THEM THE DEKATRIX, *A POWERFUL GADGET* WITH 10 *POWERS.*




"ఈ ఏడాది ఇంకా వర్షాలుపడట్లేదు" అన్నది సిటీ మొత్తంలో వార్త. రైతులు తమ పంటని సరిగా పండించలేకపోతున్నారు ఎందుకంటే నీరు పరిమితంగా లభిస్తోంది.




రామ్ అండ్ శ్యామ్ మేఘాల వద్దకు వెళ్ళి ఈ ఏడాది ఇంకా ఎందుకు భూమి నీటిని అందించట్లేదని అడిగారు.







రామ్ అండ్ శ్యామ్ గొవా పాపిన్స్‌ని తిని ఫోర్స్-ఫీల్డ్ శక్తి మొత్తం భూమిని కవర్ చేస్తూ అన్‌లాక్ చేస్తుంది.






మేఘాలు భారీగా వర్షించసాగాయి. ఫోర్స్-ఫీల్డ్ వర్షపు నీటిని ఫిల్టర్ చేసి అందులో ఉన్న యాసిడ్ నాశనం చేసింది.

భూమి ఆరోగ్యకరమైన వర్షపు నీటిని ఆనందిస్తోంది మరియు పరిస్థితి మామూలు అవుతోంది.




PARLE

## అభినందనలు!

హే మిత్రులారా, మేము సూపర్ ఎస్టాటిక్‌గా పోటీకి మీ బదులుని ఉత్సాహంగా చూస్తున్నాం. పోపిన్స్ సాయంతో ఎన్నో కఠినమైన సమస్యలని పరిష్కరించాం, విలన్లతో పోరాడాము మరియు ప్రపంచాన్ని కాపాడాము కానీ విజేతలని ఎంపిక చేయడంలో మాత్రం మేము చాలా కష్టపడుతున్నాం. లక్కీ విజేతలని వెబ్‌సైట్‌లో www.parleproducts.com లో ఉంచుతాము. ఈ సారి గెలవని మా మిత్రులారా, విచారించకండి! ఎన్నో పోటీలు భవిష్యత్తులో మీముందుకు రాబోతున్నాయి. కనుక మరోసారికి బెస్ట్ ఆఫ్ లక్.

ఫిబ్రవరి పోటీలో లక్కీ విజేతలు

1st నవీన్ గుప్త

2nd స్వాతి కె వ్యాసి

3rd షాజి మోన్ ఎమ్‌పి

గత పోటీ జవాబు 'C'

# ఈ సంచికలో...



చందమామ Volume-2 July 2011 Issue-07

















Editor, CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.



T

# మేఘాలూ... వర్షాలూ... ఆశలూ

ప్రతి సంవత్సరం లాగే, మనందరం వానలు మామూలుగా కురవాలని కోరుకుంటూ ఆకాశానికేసి ఆశగా చూస్తుంటాము. వర్షం సజావుగా కురిస్తేనే మన జీవితం సజావుగా సాగిపోతుంది మరి! నీళ్ల విషయంలో స్వావలంబన సాధించేవైపుగా దేశానికి తోడ్పాటు అందించవలసిన బాధ్యత దేశపౌరులుగా మనమీదే ఉంది. ఈ అంశంపై కొత్త, సృజనాత్మకమైన ఆలోచనలు తెలుపవలసిందిగా చందమామ పాఠకులను కోరుతున్నాము. ఈ దిశగా పాఠకులు తమ వంతు ప్రయత్నం చేస్తారని, మనందరికీ తెలియపరుస్తారని ఆశిస్తున్నాము.

ఈ సంవత్సరానికి చదువులు, అదనపు పాఠ్యాంశాలపట్ల మనం పథకం రూపొందించుకోవాలి. ఈ రకంగానే విజయ సాధనకు మనం సంసిద్ధమవుతాము. అలాగే పరీక్షలకు, మార్కులకు మాత్రమే మనం విలువ ఇవ్వకూడదు. మనకు సర్వతోముఖాభివృద్ధి అవసరం. పరీక్షలలో తమ సామర్థ్యానికి తగినట్లుగా సాధించలేదని ఎవరయినా కుంగిపోవడం మన కంటబడినట్లయితే, మనం ఆ వ్యక్తికి మద్దతుగా నిలబడి మొత్తం పరిస్థితిని అర్థం చేయించాలి. అవసరమైన సమయంలో మిత్రులనుంచి ప్రోత్సాహం అన్నివేళలా సహకరిస్తుంది.

చందమామ విషయాంశాన్ని మార్చవలసిన అవసరముంది. ప్రస్తుతం పత్రికలో ఉన్న విషయంపై పాఠకులు తమ అభిప్రాయం తెలపాలని కోరుతున్నాము. పత్రికలో ఏది కొనసాగించాలనుకుంటున్నారో, దేన్ని నిలిపివేయాలనుకుంటున్నారో, కొత్తగా వేటిని ప్రారంభించాలనుకుంటున్నారో మాకు తెలియజేయాలని పాఠకులను కోరుతున్నాము.

– సంపాదకులు




జూలై 2011 ₹20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar
**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor :**
Patricia Pandian
**Content Head - Online :**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar
**Artist :**
Venki
**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar
**Production In-charge :**
Prashant Pawar
**Circulation:**
circulation@chandamama.com
**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej
**Sales Officer - Circulation :**
K. Ravishankar
**Advertisement :**
sales@chandamama.com
**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828
**Head Office :**
CHANDAMAMA INDIA LTD.,
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD., Published and Printed on their behalf by Prashant Sharad Mulekar Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093. Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar

# పాఠకుల లేఖలు

మే నెల చందమామలో 'అతి సర్వత్ర వర్జయేత్', 'ప్రాప్తం', 'తగిన వరుడు' కథలు చాలా బాగున్నాయి. చందమామ ఆర్ట్‌బుక్ ప్రకటన, ఒక పుట అయినా అద్భుతంగా ఉంది. వివిధ వృత్తుల పట్టిక బాగుంది. కాని చందమామ లోకజ్ఞానం క్విజ్ పాఠకులకు అగ్నిపరీక్షలా ఉంది. ఈ శీర్షికను మార్చండి.

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

ఈ మధ్యే ఏప్రిల్ నెల చందమామ అందింది. ముఖ చిత్రం, అట్ట చివరి బొమ్మా బాగా నచ్చాయి మా పిల్లలకి. కథలు చదివి వినిపించమని అడిగి చదివించుకుంటున్నారు.

– జి.లలిత, న్యూజెర్సీ, యుఎస్‌ఏ

మే నెల చందమామ కథలు పత్రిక విశిష్టతను చాటుతున్న రీతిలోనే ఉన్నాయి. చందమామ అంటే ముందు బొమ్మలు, తర్వాతే కథలుగా పేరు పొందాయి. ఇప్పటి పత్రికలోని బొమ్మలు నావంటి చిత్రకారులకు కూడా అసంతృప్తి కలిగిస్తున్నాయి. వెలిసిపోయిన బొమ్మలు ప్రచురించడం పత్రికకు మంచిది కాదు. కొన్ని కథలకు బొమ్మలు మరీ నాసిరకంగా కనిపిస్తున్నాయి. చందమామ బొమ్మలవిషయంలో జాగ్రత్త తీసుకోండి.

– ఎంవీవీ శాస్త్రి, మచిలీపట్నం, ఎ.పి

వ్రాత అక్షరాలను బట్టి వారి మనోరీతులు తెలుస్తాయి అనటం సబబు కాదు. మహాత్మా గాంధీ తాను చనిపోవువరకు అక్షరాలు బాగా కుదరవని చింతించారట. గాంధీజీ అక్షరాలను బట్టి ఆయన మనోరీతి అర్థమవుతుందా? అనేక రంగాలలో కష్టించి రాణించిన వారి గురించి క్లుప్తంగా ప్రచురించండి.

– శ్రీమతి మాచిరాజు, గూడూరు, ఎ.పి

'అపూర్వ స్తంభం', 'రత్న కిరీటం', 'పాతాళ భైరవి' వంటి సీరియల్స్ పునః ప్రచురించబడలేదు. వీటిని మళ్లీ ప్రచురించి కొత్త తరాలపాఠకులను కూడా రంజింపచేయండి.

– ఎస్. వెంకటేష్, బెంగళూరు

చందమామతో తమ అనుబంధాన్నీ, ఆత్మీయతనూ వివరిస్తూ, ఎందరో వ్రాస్తున్న ఉత్తరాలు చదువుతూంటే ఒళ్ళు పులకరించి మనసు ఆనందంతో తాండవమాడుతోంది. వాళ్లపేరు, ఊరుతో పాటు వాళ్ల ఫోన్ నంబర్లు కూడా ప్రచురించండి.

– కె.ఎస్.వి. ఆంజనేయులు, విశాఖపట్నం

# అనుభవం

పూర్వం శృంగేరి అరణ్యాలలో రుష్యంగుడు, బదరీనాథుడు అనే ఇద్దరు మునులు తపస్సు చేస్తూండేవాళ్లు. ఇద్దరూ నడివయసువాళ్లు. వాళ్లుండే ఆశ్రమాలు పక్కపక్కనే ఉండేవి.

ఒకనాడు బదరీనాథుడు, రుష్యంగుడితో, 'నాకు కొన్నాళ్లపాటు, ఈ అరణ్యం వదలి ప్రజలమధ్య నివసించాలని ఉన్నది. ఈ కోరికను అదుపులో పెట్టలేకపోతున్నాను,' అన్నాడు.

అది విని రుష్యంగుడు రెండు క్షణాలు సాలోచనగా ఉండిపోయి, తర్వాత, 'బదరీనాథా! నీకోరిక చిత్రంగా ఉన్నది. అయినా అది నీ కోరిక! అలాగే చెయ్యి,' అన్నాడు. మర్నాడు బదరీనాథుడు అరణ్యం విడిచి, పక్కనే ఉన్న నగరాన్ని చేరాడు. ఆ నగర సౌందర్యం, వింతలూ, విశేషాలూ అతణ్ణి బాగా ఆకర్షించాయి. అయితే, నెల తిరక్కుండానే అక్కడి పౌర జీవితంలోని మోసాలూ, దగాలూ, ధనంకోసం, అధికారం కోసం వాళ్లు చేసే కుట్రలూ, జగడాలూ చూసి బదరీనాథుడికి ముఖంమొత్తింది. అతడు నగరం వదిలి, అరణ్యంలోని తన ఆశ్రమానికి వచ్చేశాడు.

బదరీనాథుడు తిరిగి రావడం, రుష్యంగుడికి చాలా ఆనందం కలిగించింది. అయితే, నగరంలో తనకు కలిగిన అనుభవాల గురించి బదరీనాథుడు చెబుతూంటే, వినీ విననట్లు ఊరుకోసాగాడు, ఇది గమనించిన బదరీనాథుడు, అతణ్ణి, 'నగర జీవితం అంటే నీకేమాత్రం ఆసక్తి లేకపోవడానికి కారణం ఏమిటి? ధ్యాననిష్ఠ భంగపడుతుందని భయమా?' అని అడిగాడు.

రుష్యంగుడు అందుకు చిన్నగా నవ్వి, 'నగర జీవితం గురించిన విశేషాలు వినడం అంటే నాకు కలిగేది భయం కాదు. అయిష్టత! నువ్వు పౌరజీవితం నుంచి విరక్తి కలగకుండానే, ఏదో తాత్కాలిక ఆవేశంతో, మునిలా జీవిద్దామని ఈ అరణ్యం చేరావు. అందువల్ల, నీ మనస్సు నగర జీవితం రుచిచూడమని అప్పుడప్పుడూ పోరుతూండవచ్చు. అది నీ తప్పు కాదు. నగరజీవితం పట్ల పూర్తిగా విరక్తి చెందని నీ అనుభవం లేమి తప్పు! ఇక మునిగా ధ్యానంలో నా అంతటి ఏకాగ్రతను సాధించగలవు,' అన్నాడు.

ఆ తర్వాత కొంతకాలానికి బదరీనాథుడు, రుష్యంగుడు చెప్పినట్టే, ధ్యానంలో ఏకాగ్రతను సాధించి మునిగా పరిపూర్ణుడయ్యాడు.

– భీమవరపు పురుషోత్తం



Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions - within India)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
Go to www.chandamamashop.com & subscribe Now!!



You can also subscribe online at: **www.chandamamashop.com**

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..............................................................................................

Date of Birth: ................................... Sex :.......................................

Address: ..........................................................................................

..........................................................................................................

..........................................................................................................

..................................................... City: ..............................................

State:........................................ Pin:..................................................

Telephone:.........................................................................................

Mobile:...............................................................................................

Email:.................................................................................................

Subscription Number. (for renewals):...............................................

Gift Subscription to the following address:

..........................................................................................................

..........................................................................................................

..........................................................................................................

..........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees................................................

Cheque/DD No ...........................................................................

favouring Chandamama India Ltd on..........................................

..........................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
P.O.Box No:19407, Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at : www.chandamamashop.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# బంగారుబాట

హేలాపురిలో ప్రతి ఏడూ కవి సమ్మేళనాలు జరుగుతుంటాయి. మహారాజు విక్రమసేనుడు. స్వయంగా కవి కూడా కావడంతో ఆ కవి సమ్మేళనాలు జనరంజకంగా సాగుతుంటాయి.

కవి సమ్మేళనాలలో పాల్గొనడానికి, తిలకించడానికీ ప్రజలు తండోపతండాలుగా వస్తుంటారు. ఆ యేటి మేటి ఉత్తమ గ్రంథం రాసిన కవికి సన్మానం చేయడంతోపాటు, అనేక విలువైన కానుకలు కూడా అందిస్తుంటారు.

ఆ యేడు కూడా సమ్మేళనాలు జోరుగా సాగాయి. అనేక వడపోతల తరువాత సోమకవి రాసిన కురుక్షేత్ర సంగ్రామం గ్రంథం ఉత్తమమైన గ్రంథంగా ఎన్నుకోబడింది.

ఆ గ్రంథం రచించిన సోమకవిని ఘనంగా సన్మానించిన మహారాజు విక్రమసేనుడు - కవిని ఏం కానుక కావాలో కోరుకోమన్నాడు.

'మహారాజా! ఇకపై నేను వేసే ప్రతి అడుగూ బంగారం మీదే పడాలి. ఎల్లవేళలా నేను బంగారంపైనే నడవాలి. అదే నా కోరిక,' అన్నాడు సోమకవి.

సోమకవి కోరిన ఈ వింత కోరిక విని మహారాజుతోపాటు సభాసదులందరూ కూడా నివ్వెరపోయారు.

సోమకవి కోరిన కోరిక తీర్చడానికి దేశంలోని బంగారం అంతా కరిగించి రహదారులు నిర్మించినా ఆయన కోరిక తీర్చడం అసంభవం.

మహామంత్రితో సంప్రదింపులు జరిపి, అనేక ఆలోచనలు చేసిన మీదట సోమకవి కోరిక తీర్చబడింది.

అతడికి బంగారు పాదరక్షలు బహూకరించబడ్డాయి.

- కోనే వెంకట ఆంజనేయులు



# చందమామతో నా జ్ఞాపకాలు

అప్పుడు నా వయసు పదహారు -1947-. ఇప్పుడు ఎనభై -2011-. అప్పుడంటే ఎప్పుడని? చంద్రోదయమయినప్పుడు.అంటే తెలుగు పిల్లల అందాల మాసపత్రికగా చందమామ మొట్ట మొదటి సంచిక వెలువడిన నాటి మాట. అందులో నే వ్రాసిన 'పొట్టి పిచిక' కథ అచ్చవడం ఓ విధంగా నా సాహితీ ప్రస్థానానికి తొలి బీజం అవడం కన్న తీపి గుర్తు మరేముంటుంది! నాటి నా బాల్యంలో తొంగి చూసిన ఆ తొలికిరణపు రూపురేఖలే నేటి ఈ వృద్ధాప్యంలో కూడా కొనసాగడం మించిన ఆశ్చర్యం, ఆనందం ఇంకేముందని!

అమ్మ చెప్పిన కథే అయినా, అందరికీ తెలిసిన కథే అయినా, మంచి ప్రింటుతో చక్కని బొమ్మలతో వచ్చిన నాటి ఆ చందమామ లోని కథాంశం నా మనసుమీద ఇరంప్రింటు చేసేసినట్లుంది! ఓ బడుగు జీవి తను కష్టపడి సాధించుకున్నది అది లేశమే ఔగాక, పోగొట్టుకుంటుంది. ఎంతమందినో కలుసుకుని, ఎవరూ కలిసిరాకపోయినా, పట్టుదల వదలక, చివరికి విజయం సాధిస్తుంది. అదీ 'పొట్టి పిచిక కథ'. అదే నా విజయసూత్రం అవుతుందని ఆనాడనుకోలేదు! వెయ్యి పైగా రచనలు చేసి, ఈనాటికీ తల వంచక, కలం దించక తెలుగు కథకుడిగా కొనసాగుతున్న నాకు వేగుచుక్క ఆ కథే కదా! పక్షులతో జంతువులతో మనుషుల్ని కలిపి సామాజికాంశాల్ని సరళంగా చెప్పవచ్చునని నేను నేర్చుకున్నది చందమామ పత్రిక చలవవల్లనే. 'గణిత విశారద' అనే నవల రాసింది చందమామ పఠన స్ఫూర్తితోనే. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నుంచి 1969లో బహుమతి పొందిన నా 'అర్థమున్న కథలు' పబ్లిషర్స్ చందమామ రక్తసంబంధికులు 'యువప్రచురణలు' వారే. అంతేకాదు. నేను చలసాని-చక్రపాణి అవార్డు అందుకోడం కూడా తత్సంబంధమైన సత్సాంప్రదాయమే.



Name: A. Ramakrishna Rao
Occupation: Teaching
Vishakapatnam, A.P.

సైజుతో పాటు చురుకుతనంలో కూడా నాటి పొట్టి పిచిక లక్షణాలు ఇప్పటికీ నాలో మిగిలి ఉన్నాయని నా మీద నేను వేసుకునే స్మోకైన జోకు! చందమామ కథ ఇచ్చిన ఊపుతో నేవ్రాసి పుస్తక రూపంలో వచ్చిన పిల్లల రచనలు 'కేటూ డూప్లికేటూ', 'మేథమె tricks' మూడు భాగాలూ, 'అంగ్రేజీ మేడీజీ' 'అంగ్రేజీ యమఈజీ' ఇలా మరో అరడజనువరకు చిరు సరుకు దొరుకు.

నెలనెలా వెన్నెలలద్దుకుని, చకచకా సొగసులు సరిదిద్దుకుని, పదారుభాషల వారి కితాబులందుకుని భారతీయ పత్రికగానే కాక, అంతర్జాతీయ స్థాయిని చేరుకున్న చందమామ పుట్టింది మన భాషలోనే అని తలుచుకుంటే ఉప్పొంగని తెలుగు గుండె ఉండదు. కాలక్షేపం కథలతోనే సరిపెట్టుకోక శాస్త్రీయ పరిశోధనాత్మత వ్యాసాలూ, మెదడుకి మేతగా పోటీలూ, అన్యభాషలు నేర్పే ఏర్పాట్లూ-- ఇవన్నీ కంటికి నదురైన రంగులతో, అచ్చుతో, అనువైన సైజుతో ఇక్కడ కాక మరెక్కడ దొరుకుతుందని! ఈ సంస్థ పుస్తకరూపంలో పిల్లలకందించే విజ్ఞాన వర్గకోశాలు ఎన్నెన్నని! ఇంతెందుకు ఇటీవల వీరు ప్రచురించిన చందమామ Art Book చూశారా! పదిహేనువందల ఖరీదు కాస్త ఎక్కువే అనిపించవచ్చు కాని అది అందించే శతకోటి అందాల మాట?

నా తొలి ప్రేమ చందమామ. వాఙ్మయ వర్ణార్ణవం... ఈ నాటికీ కథాసుధల్ని వెదజల్లుతూ హాయిగా జీవించగలిగే నా మనోధృతికి నాటి చందమామే మధురస్మృతి!



## బేతాళ కథలు

# పరిసరాల ప్రభావం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా! నువ్వు ఈ అపరాత్రి వేళ స్వార్థం కొద్దీ ఏవైనా అపూర్వ శక్తులు సంపాయించాలని ఇంత శ్రమ పడుతున్నావో లేక పరిసరాల ప్రభావం ఎలా మనుష్యుల నడవడికను తీర్చి దిద్దుతుందో తెలుసుకోవడానికి ఇన్ని ఇక్కట్లను ఓర్చుకుంటున్నావో తెలియడం లేదు. పరిసరాల ప్రభావం ఎలా ఉంటుందో తెలియజేసే ఒక కథను చెబుతాను. శ్రమ తెలియకుండా విను,' అంటూ ఇలా చెప్పసాగాడు.

శిల్లంగేరి దేశాన్ని నరేంద్రుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. అతనికి ఇద్దరు కుమారులు, ఇంద్రసేనుడు, చంద్రభానుడు.

నరేంద్రుడు తన పెద్ద కుమారుడు ఇంద్రసేనుణ్ణి అతడి బావమరిది ప్రశాంత



సేనుడికి దత్తత ఇచ్చాడు. ప్రశాంత సేనుడికి సంతానం లేనందున ఇంద్రసేనుణ్ణి దత్తత తీసుకుని యువరాజుగా ప్రకటించాడు. ఇతడు పొరుగు దేశం గంగాపురం రాజు.

నరేంద్రుడు చిన్నప్పటి నుండి చెడు అలవాట్లకు బానిసై ఎల్లప్పుడూ తాగుతూ వినోద క్రీడలలో కాలం గడుపుతూ రాజ్య పాలనను తన మంత్రి ఉగ్రసేనుడికి, సర్వ సైన్యాధికారి బలభద్రుడికి అప్పగించి కాలం గడుపుతూ వచ్చాడు.

దీన్ని అలుసుగా తీసుకున్న మంత్రి, సర్వసైన్యాధిపతి ఇద్దరూ స్వలాభాలను ఆర్జించుతూ దేశం రాబడినంతటినీ రాజు లాగే తాగడానికి, వినోదక్రీడలకు ఉప యోగిస్తూ పాలనను చెడుమార్గంలో నడి పిస్తూ ఉండేవారు.

దేశ ప్రజల మీదమోయలేని పన్నులను వేస్తూ, వారికి ఏ సదుపాయాలను చేకూ ర్చకుండా బాధపెడుతూ ఉండేవారు. దేశంలో విద్యామందిరాలు గాని, రహదా రులు గాని, చెరువులు గాని, కట్టించ కుండా దేశంలో దరిద్రదేవతను విచ్చల విడిగా విహరించేలా చేసేవారు. ప్రజలెవ రైనా వీళ్ల చెడు పరిపాలనను గురించి ప్రస్తావిస్తే వారిని చెరసాలలో పడేసి నానా హింసలూ పెట్టేవాళ్లు.

ఇలా కొంతకాలం జరిగేటప్పటికి ప్రజ లలో తిరుగుబాటుకు తోవ ఏర్పడుతున్న సమయంలో దేశంలోని కొందరు పెద్దలు గంగాపురం రాజధానికి వెళ్ళి అక్కడ సుప రిపాలనను జరుపుతున్న ప్రశాంతసేనుడి వద్ద తమ బాధలను మొరపెట్టుకున్నారు.

'మహాప్రభూ, మేము నరేంద్రుడి అతడి మంత్రి సేనాధిపతుల చెడు పరిపాలనను ఏమాత్రమూ సహించలేము. మీరు మా తరపున జోక్యం చేసుకుని అక్కడ సుపరి పాలన వచ్చే మార్గం చేసిపెట్టాలి,' అన్నారు.

కానీ ప్రశాంతసేనుడు వారితో 'మేము ఇతర దేశాల పరిపాలనలో ఎలా జోక్యం చేసుకోగలం. అతడు సర్వస్వతంత్రుడు కదా?' అని అన్నాడు.

శిళ్ళంగేరి నుంచి వచ్చిన నాయకులు ప్రశాంతసేనుడి పరిపాలనను చూసి ఆశ్చ ర్యపోయారు.

గంగాపురంలోని ప్రతి గ్రామంలోనూ ఒక చెరువు, బాలబాలికలకు విద్యా మందిరం, ఒక ఊరి నుండి మరొక ఊరికి

వెళ్లడానికి మంచి రహదారులతోపాటుగా ప్రజలపైపన్నులు చాలా తక్కువగా ఉండేవి.

పరిపాలనా లోపాలను ఎవరైనా రాజు దగ్గరకు తీసికెళ్లితే వారికి మంచి బహు మానం ఇచ్చి వారు చూపిన లోపాలను సరిదిద్దడానికి తగు చర్య తీసుకునేవారు. ప్రభుత్వ ఉద్యోగులకు ఆ దేశంలో లంచం ఏమిటో తెలియదు.

ప్రశాంతసేనుడు తాను దత్తత తీసు కున్న ఇంద్రసేనుడికి చిన్నప్పటినుండి సకల శాస్త్రాలను, శాసనాలను, విద్యలను, దేశపరిపాలనా విధానాలను గూర్చి మంచి దిట్టమైనపండితులతోనేర్పించాడు. ఇంద్ర సేనుడు ధైర్యసాహసవంతుడు కూడా అయ్యాడు. తన దత్తత తండ్రికి పరిపాల నలో అన్ని విధాలా సహాయం అందిస్తూ వచ్చాడు.

శిళ్ళంగేరి దేశంలోని నాయకులు తన తండ్రితో మాట్లాడటానికి వచ్చినప్పుడు ఇంద్రసేనుడు కూడా అక్కడున్నాడు. తన తండ్రి శిళ్ళంగేరి నాయకులకు సహాయం చేయడానికి నిస్సహాయత వ్యక్తం చేసిన ప్పుడు తాను జోక్యం చేసుకుని, వచ్చిన పెద్దలతో అన్నాడు. 'నా తమ్ముడు చంద్ర భానుడు ఉన్నాడు కదా. వాడు యువ కుడు. అతణ్ణి రాజుగా చేస్తే పరిపాలనలో మంచి మార్పు రావచ్చు కదా?' అన్నాడు.

అందుకు ఆ నాయకులు ''లేదు రాకు మారా, లేదు. అతనూ ఆ దుష్టద్వయం మంత్రి, సేనాధిపతులతో కలిసి భ్రష్టు పడ్డాడు. వారివల్లనే చెడ్డ అలవాట్లకు బలి అయ్యాడు. ఏమీ ప్రయోజనం ఉండదు'' అని చెప్పారు.

ఇంద్రసేనుడు తండ్రివైపు తిరిగి:





'నాన్నా.. క్షమించండి. శిళ్ళంగేరి దేశాన్ని పరిపాలిస్తున్నది ఎవరో కాదు. నా తండ్రే కదా! మీకూ బావయే కదా! అటువంటప్పుడు వాళ్లను చెడ్డత్రోవ నుంచి మందలించి ఆ దేశపు ప్రజలకు సుఖశాంతులు ఇవ్వాల్సిన బాధ్యత మనకు లేదా! కనుక మనం జోక్యం చేసుకోవడంలో ఎలాంటి తప్పులేదు కదా బాధ్యత కూడా ఉంది,' అని తన అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పాడు.

ప్రశాంతసేనుడు ఒక నిమిషం ఆలోచించి, 'నీవన్నదీ ఉచితంగానే ఉంది. కనుక మనమిద్దరం శిళ్ళంగేరి వెళ్లి, మీ తండ్రిని కలుసుకుని అతణ్ణి సన్మార్గంలోకి తీసుకొని రావడానికి ప్రయత్నిద్దాం,' అని అంగీకరించాడు.

మరుసటి రోజే ప్రశాంతసేనుడు, ఇంద్రసేనుడు శిళ్ళంగేరి రాజధానికి వెళ్ళి నరేంద్రుణ్ణి కలుసుకుని ఆ రాజ్యంలో ఉన్న దుస్థితి గురించి వివరంగా చెప్పారు. అందుకు కారణం తాను పరిపాలనను దుష్టద్వయం మంత్రి, సేనాధికారులకు విడిచి పెట్టడమే అని వివరించారు. కాని ఇంద్రసేనుడు వారి సలహాను పెడచెవిన పెట్టేసి:

'మేము సర్వస్వతంత్రులం. మా దేశాన్ని ఎలా పరిపాలించాలో మాకే బాగా తెలుసు. మీ జోక్యాన్ని మేము సహించము. ఇక మీరు వెళ్ళవచ్చు' అని తప్పతాగుతూ వాళ్ళను అవమానించి పంపాడు.

ఇంద్రసేనుడు నిస్పృహ చెందలేదు.

తన తండ్రి అనుమతితో ఒకరోజు ఇంద్రసేనుడు పెద్దసైన్యం వెంటబెట్టుకుని శిళ్ళంగేరిపై మెరుపుదాడి చేసి మంత్రిని, సైన్యాధిపతిని చెరసాలలో బంధించాడు. తన తండ్రిని రాజభవనంలో ఒక గదిలో అన్ని సౌకర్యాలు సమకూర్చి ఉంచాడు.

తన తమ్ముడు చంద్రభానుణ్ణి తన దేశం గంగాపురానికి తరలించి అక్కడ అతడి సకల విద్యలను, పరిపాలనా విధానాన్ని బోధించడానికి గురువులను ఏర్పాటు చేశాడు. అతడు మంచి పరిసరాలలో ఉండేటట్టు ఏర్పాటు చేశాడు.

ఏడు సంవత్సరాలు గడిచాయి. శిళ్ళంగేరిని కూడా ఇంద్రసేనుడు తన పరిపాలనలో గంగాపురం దేశంలాగే సుభిక్షంగా మార్చాడు. ఎక్కడ చూసినా చెరువులు, ఉద్యానవనాలు, పాఠశాలలు, వైద్యశా

లలు నిర్మించాడు. ప్రజలకు పన్నుల భారం తగ్గించాడు. శిళ్ళంగేరి ప్రజలు ఇప్పుడు సుఖశాంతులతో జీవనం సాగిస్తూ అమిత సంతోషంగా ఏ కంగారూ లేకుండా ఉన్నారు.

తన తమ్ముడు రాజ్య పరిపాలనకు అర్హుడని ఇంద్రసేనుడు విచారించి తెలుసుకొని అతనిని తిరిగి రప్పించి శిళ్ళంగేరి సింహాసనంపై కూర్చుండబెట్టి తాను తన దేశం గంగాపురానికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, 'రాజా! ఇంద్రసేనుడూ, చంద్రభానుడూ ఒక తండ్రి పిల్లలైనప్పటికీ వారిలో ఒకదానికొకటి విరుద్ధమైన నడవడిక గుణాలు ఎందుకిలా వచ్చాయి? ఒకడు పరమ దుర్మార్గుడు. ఇంకొకడు పరమ నీతిపరుడు. ఈ సందేహానికి కారణం తెలిసి కూడా చెప్పకపోయావంటే నీ తల వెయ్యితునకలై పోతుంది,' అన్నాడు.

దానికి విక్రమార్కుడు ఇలా సమాధానం చెప్పాడు. 'చంద్రభానుడూ, ఇంద్రసేనుడూ ఒకే తండ్రి కుమారులు నిజమే! కాని వాళ్లిద్దరూ పెరిగి పెద్దవాళ్ళయినది మాత్రం పూర్తిగా భిన్న పరిసరాలలో. ఇంద్రసేనుడు మంచి పరిసరాలలో పెరిగి పెద్దవాడయ్యాడు. కనుక అతడికి మంచి నడవడికే అబ్బింది. కానీ చంద్రభానుడు తన తండ్రి, మంత్రి, సేనాధిపతులు ముగ్గురూ చెడు నడవడిక నడుస్తున్నవాళ్లు వారి అడుగు జాడలలో పెరిగి పెద్దవాడయ్యాడు. కనుక ఇద్దరి నడవడికలకు కారణం వాళ్లు పెరిగి పెద్ద



వాళ్లయ్యే దాక ఉన్న దుష్ట పరిసరాలు. అందుకే అతడు దుష్టుడయ్యాడు కానీ తరవాత మంచి పరిసరాలలోనికి వెళ్లినప్పుడు మంచివాడుగా మారిపోయాడు. ఇందుకు నిదర్శనంగా నేనొక చిన్న కథ చెబుతాను విను. నీ సందేహంతో తీరిపోతుంది,' అని విక్రమార్కుడు కథ చెప్పసాగాడు.

ఒకప్పుడు ఒక బోయ వేటగాడు అప్పుడే ఎదిగిన రెండు చిలకలను ఒక చెట్టు గూడు నుంచి పట్టుకుని వెళ్ళాడు. అందులో ఒకటి రెక్కలు రాగానే తప్పించుకొని ఒక ముని పుంగవుని ఆశ్రమం చేరుకుంది. ఆ చిలుకను మునిపుంగవుడు ఒక పంజరంలో పెట్టితన ఇంటి ద్వారం వద్ద ఉంచాడు. బోయ వేటగాడు కూడా అలాగే తన వద్ద

ఉన్న చిలుకను ఒక పంజరంలో పెట్టి ఇంటిముందర పెట్టాడు.

ఒక రోజు ఆ దేశపు రాజు వేటకు వచ్చి నీళ్లు తాగడానికి వేటగాడి ఇంటివద్దకు వచ్చాడు. రాజును అతడి పరివారాన్ని చూస్తూనే ఆ చిలుక: 'మీరందరూ ఎవరు? ఇక్కడికెందుకు వచ్చారు? వెళ్లండి, నీళ్లు లేదు గీళ్ళు లేదు. చంపేస్తాను,' అని అర వడం మొదలెట్టింది. రాజు పరివారం అక్కడి నుంచి ముందుకు వెళ్ళి ముని పుంగవుని ఆశ్రమం వద్దకు వచ్చారు. వారిని చూస్తూనే పంజరం లోని చిలుక 'మహాత్ములారా! లోపలికి రండి. దాహం తీర్చుకోండి. ఈ పూట మాకు అతిథు లుగా ఉండి మా ఆతిథ్యం స్వీకరించి మమ్ములను ఆనందపరచండి.. రండి.. రండి..' అంటూ ఎంతో మృదు వాక్యాలతో వాళ్లను ఆహ్వానించింది. రాజు పరివారా నికి ఆశ్చర్యం వేసింది. రెండు చిలుకలు ఒకే గూటి నుంచి వచ్చాయని ఆ చిలుక నుండి తెలుసుకున్నారు. రాజు మునితో:

'మునిపుంగవా! ఇదివరకు మాకు తట స్థపడిన చిలుక, ఈ చిలుక ఒకే గూటిలో నుండి వచ్చాయి కదా! అయినా వాటి ప్రవర్తనలో ఎంతో భేదముంది? ఎందు వలన?' అని అడిగారు. అందుకు ముని నవ్వుతూ:

'మహారాజా, దీనికి కారణం అవి పెరిగి పెద్దవైన వాతావరణం అంటే పరిసరాలే కారణం. బోయవాడి ప్రవర్తనలాగే ఆ చిలుక ప్రవర్తించింది. మాలాగే ఈ చిలుక ప్రవర్తించింది. కనుకనే మనం పిల్లలను సరైన నీతినియమం మంచి గుణాలు ఉన్న పరిసరాలలోనే పెంచి పెద్దవాళ్లను చేయాలి' అన్నాడు.

విక్రమార్కుడు కథ ముగిస్తూ 'ఇంద్ర సేనుడూ, చంద్రభానుడూ కూడా ఇంతే. ఇప్పుడు నీ సందేహం తీరింది కదా,' అన్నాడు. రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)

(ఆధారం : కోలార్ కృష్ణ అయ్యర్)






# కటికవాని గుండె

అనగనగా ఝుంకారుడనే ఒక కటిక వాడు ఉండేవాడు. వాడు రోజుకి ఏభైపశువులనైనా అవలీలగా వధించగలిగేవాడు.

ఝుంకారుడికి ఇది తరతరాలా వస్తున్న కులవృత్తి కావడం చేత, దయా, దాక్షిణ్యమూ, కనికరమూ, అంతఃకరణ అనేవి వానికి ఏ కోశానా లేకపోయినై.

ఇన్ని జీవాలు తీసిన ఝుంకారునికి లేకలేక ఒక్క కూతురు పుట్టింది. ఆ పిల్ల దేవి కటాక్షం వల్ల పుట్టడం చేత అంబ అని పేరు పెట్టుకుని, అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు.

అంబ పుట్టిన క్షణం నించీ ప్రేమ అంటే ఏమిటో, అభిమానం అనేది ఎలా ఉంటుందో ఆ కటిక వాడికి తెలిసి వచ్చింది.

అంబ పెరిగి పెద్దదయింది. ఆమె అందవతి, అంతకుమించిన గుణవతి కూడా. పైగా జాలిగుండె కలది. ఆమెను చూచి, ప్రజలు 'అహా ! ఝుంకారుని అదృష్టం ఏమి అదృష్టం!' అని సంతోషించేవారు. ఆమె ఎన్నడూ మాంసం నోట బెట్టకపోవటం చూచి లోకులు మరీ అబ్బురపడేవాళ్ళు.

ఒక రోజు ఝుంకారుడు అంగడిలో ఉండే సమయమందు - ముద్దులు మూట కట్టే ఒక ఆవుదూడను ఎవరో యింటికి తీసుకువచ్చి అమ్మజూపారు. దానిని చూచీ చూడడంతోనే అంబ, దాని యజమానికి కోరిన ధనమిచ్చి కొనుక్కున్నది. సాయంకాలం ఝుంకారుడు ఇంటికి వచ్చే సరికి, అంబ ఆవుదూడతో ఆడుకొనటం చూచి, ఆశ్చర్యపడ్డాడు. ఆమె ఏమి చేసినా అతనేమి అనడు. కనుక, ఇలా ఆమె ఆడుతున్నందుకు కూడ ఏమీ అనలేదు.

కర్రి కాశీసత్యనారాయణ



కాని, అతను అడగకుండానే ఆడుకొంటూవున్న అంబ, తండ్రిని చూచినదే తడవుగా అతన్ని చుట్టేసుకుని 'నాయనా! ఎంత ముచ్చటగా వున్నదో చూడు ఈ ముద్దుల తువ్వాయి! దాని మూపురం చూడు, గంగ డోలు చూడు, దాని అమాయకపు చూపులు చూడు...' అనేటంతలో దూడవచ్చి, అంబ ఒళ్ళు నాకజొచ్చింది. ఆమె గబుక్కున 'నా చిన్నారి గున్నా! ఎంత ప్రేమే నీకు. ఎంత అభిమానమే. నువ్వెవరివో, నేనెవరినో. మనకుగల సంబంధమేమిటి? నీకు నోరు పెట్టలేదుగదా ఆ మాయదారి దేవుడు. ఐనా, నువ్వు చెప్పినమాట నాకు తెలిసిందిలే... నన్ను ఎందుకు నాకుతున్నావో అర్థమైందిలే,' అంటూ దాని మెడ గట్టిగా చుట్టేసుకుని ముద్దులాడింది.

అంబ మాటలు, చేష్టలూ, దూడతో పలికే పలుకులూ ఝుంకారుడికి వింత గొలిపాయి. దూడతో ఆడుతున్న అంబ మళ్ళీ తండ్రిని చుట్టేసుకుని 'నాన్నా! నా తువ్వాయి చూడు! నన్ను పేరు పెట్టి 'అంబా..' అని పిలుస్తున్నది! నువు చెప్పావా? అవునుగాని, నేనొక మాటంటాను, నీకు కోపం వస్తుందేమో! అన్నది.

'కోపమెందుకు తల్లీ, ఎప్పటికీ రాదు' అంటూ ఆమెను దగ్గరికి తీసుకున్నాడు.

'మరైతే విను : మిసమిసలాడే పశువులను, నవనవలాడే లేగలనూ విసుగూ విరామమూ లేకుండ చంపి చంపి, నీ చేతులు మైలపడిపోయినై. ఆ పాపపు చేతులతో నా తువ్వాయిని మట్టుకు నువ్వు తాకవద్దు. తెలిసిందా ? తాకనని ఒట్టేసుకో' అంటూ తండ్రి చెయ్యి తన చేతిలో వేసుకుంది.

ఈ మాట వినగానే ఝుంకారుని హృదయంలో కలవరం బయలుదేరింది.

ఒకనాటి అర్ధరాత్రి అందరూ గాఢంగా నిద్రిస్తూవున్న సమయంలో ఎవరో తలుపుతట్టారు. రెండు మూడుసార్లు అలా తట్టే సరికి ఝుంకారుడు లేచి తలుపు తీశాడు.

చూడగా - అతను గ్రామాధికారి. గ్రామాధికారి అంటే ఊరందరకూ హడలే!

అందుచేత ఆయన ఈ అపరాత్రివేళ స్వయంగా రావటం చూడగా ఝుంకా రుడికి కంగారు పుట్టింది. – 'చూడు ఝుంకారా..! తలవని తలంపుగా ఇప్పుడు నాకు ప్రాణస్నేహితులు వచ్చి ఉన్నారు. నీ వద్దగల ప్రశస్తమైన మాంసం ఎంత ఉంటే అంతా ఇదుగో మా నవు కరు చేతికియ్యి. ముఖ్యమైన విషయం కనక నేనే వచ్చాను' అన్నాడు.

ఝుంకారునికి పచ్చి వెలక్కాయ గొంతున పడింది. ఆ రోజున అదేమో కాని కొట్టిన మాంసమంతా ఒక్క తునక కూడా మిగలకుండా విక్రయమయిపో యింది.



ఎన్నడూ తన గుమ్మం తొక్కి ఎరుగని అధికారికి ఏం జవాబు చెప్పుకోవటం? 'బాబయ్యా! నేనే పట్టుకువచ్చి దాఖలు చేసుకుంటాను. – తమరు పదండి,' అన్నాడు ఝుంకారుడు.

'కాదు కాదు నేనిక్కడే వుంటాను. స్వయంగా తీసుకు వెళ్ళాలి. వెంటనే ఏర్పాటు చెయ్యి' అంటూ అధికారి అక్క డనే భీష్మించుకొని కూర్చున్నాడు.

గత్యంతరం లేక, ఝుంకారుడు అంబ పెంచే లేగను విప్పి కమేలాకు ఈడ్చుకు పోబోయాడు. లేగ 'అంబా అంబా' అని జాలిగా రెండుసార్లు అరిచింది.

నిద్రిస్తున్న అంబ ఉలిక్కిపడి లేచింది. తువ్వాయి కోసం చూచింది. కనపడక పోయేసరికి, ఒక్క అంగలో అడ్డుదారిని పరుగెత్తి కమేలా చేరుకుంది.

తన మెడను కత్తుల మధ్య దూర్చింది. ఇంతలో లేగదూడ నీడ్చుకొంటూ ఝుంకా రుడు గబగబా వచ్చేశాడు. కత్తి ఎత్తబో యాడు. తన చిన్నారి అంబ అక్కడ కంట పడగానే కెవ్వుమని ఒక పెద్ద కేకవేసి, చాపకట్టుగా పడ్డాడు.

కొంత సేపటికి స్మృతివచ్చి, ఝుంకా రుడు లేచాడు. తన ముద్దుల కూతు రును కరకు కత్తుల నుండి తప్పించబో యాడు. కానీ, ఆ బాలిక ఎంతకూ యివత లికి రాలేదు.

'ముందు నన్ను చంపు, తర్వాత నా తువ్వాయిని చంపుదువుగాని, నువు

నాకు ద్రోహం చేశావు నాన్నా ! ద్రోహం చేయటం జీవహింస కంటే కూడా ఎక్కువైన మహాపాపం. ముందు నన్ను చంపు, తరువాత నా తువ్వాయిని చంపు....' అన్నది.

ఝుంకారుడు 'నిజమే అంబా! నిజమే నువ్వు చెప్పినదంతా నిజమే!' అంటూ మళ్ళీ పడిపోయాడు. ఎంతసేపటికీ ఝుంకారుడు రాకపోయేసరికి, అక్కడ గ్రామాధికారి కారాలు, మిరియాలు నూరుతూ కమేలాకు వచ్చేశాడు. వచ్చి చూడగా, అతనికేమీ అర్థంకాలేదు.

ఝుంకారుడు తేరుకున్న తరువాత సంగతి సందర్భాలన్నీ వెల్లడైనాయి. లేగ దూడ 'అంబా..!' అని అరిచింది. అంబ లేచివచ్చి, దాని మెడ చుట్టేసుకుంది.

ఝుంకారుడు అంబనూ, లేగనూ కూడా చేరదీసుకున్నాడు. 'బాబయ్యా! నేను నా వృత్తి మానివేశాను, క్షమించండి,' అంటూ అధికారికి రెండు చేతులా నమస్కరించాడు.

ప్రాణాలకు వెరవకుండా అంబ చేసిన త్యాగము చూచి, ఆమె వాక్కులు వినేసరికల్లా అధికారికి కూడా మనస్సు మారిపోయింది. 'ఝుంకార! నీవు నీ వృత్తి మానేస్తే, నేను ఈనాటి నుంచి మాంసాహారం మానేస్తున్నాను. నేనే కాదు, నా మిత్రులచేత మాన్పించేస్తాను. అంతే కాదు, ఈ క్షణం నించీ, పశురక్షణకు పూనుకుంటానని అంబ సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను' అనిచెప్పి, ఒక విధమైన కొత్త ఆనందంతో యింటికి మరలిపోయాడు.





# ఎంపిక

విజయనగరంలో కామరాజు. కోశాధికారి కార్యాలయంలో పనిచేస్తున్నాడు. సొంత ఇల్లు కట్టుకుని సుఖంగా ఉన్నాడు. అతనికి హేమారాణి అనే కూతురు వుంది. ఆమె పెళ్ళీడుకొచ్చింది.

కామరాజు అక్క కొడుకు అంజయ్య, అతని బావమరది కొడుకు తమ్మయ్య, చెల్లెలు కొడుకు దేవయ్యలు. హేమా రాణిని పెళ్ళి చేసుకుని విజయనగరంలో స్థిరపడి పోవాలని ఆశపడుతున్నారు.

వాళ్ళంతా పల్లెటూళ్ళలో వుంటున్నారు. నగరంలో జీవించాలంటే కామరాజు వంటి మామ అండదండలు అవసరమని వారికి తెలుసు.

ముగ్గురు యువకులలో ఎవర్ని తన అల్లుడిగా చేసుకోవాలో కామరాజు ఎంపిక చేసుకోవాల్సి వుంది. వాళ్ళ ముగ్గుర్ని విజయనగరం రమ్మని కబురు పంపాడు.

ముగ్గురు యువకులు వారం రోజుల పాటు కామరాజు అతిథిలుగా వుండి నగరంలో వింతలు, విశేషాలు చూశారు.

ఇక వాళ్ళు తిరుగు ప్రయాణమవుతున్న వేళ కామరాజు వారిని పిలిచాడు.

'మామయ్యా! విజయనగరం గొప్ప నగరం. వర్ణించడానికి మాటలు చాలవు. విరూపాక్షదేవాలయం గోపురం ఎంతో గొప్పగావుంది. కృష్ణదేవాలయం, హజారా రామాలయంలో తిరుగుతూ,

వాణిశ్రీ

దేవుళ్ళను సేవించుకుంటూ వుండి పోవాలని వుంది.' అంటూ తన్మయత్వంతో చెప్పాడు. అంజయ్య.

'తమ్మయ్యా ! నువ్వేం చూశావు?' అని బావమరిది కొడుకుని అడిగాడు కామరాజు.

'మావయ్యా ! విజయనగరంలో పెద్ద పెద్ద మేడలు, మిద్దెలు చూశాను. బంగారు నగలు, రత్నాలు, వజ్రాలు అమ్మే దుకాణాలు చూస్తుంటే కళ్ళు తిరిగాయి. బట్టల దుకాణాలు ఎన్నో...' అన్నాడు తమ్మయ్య.

'దేవయ్యా ! నీ సంగతి ఏమిటి?' అని చెల్లెలు కొడుకుని పలకరించాడు.

'విజయనగరంలో అందరూ గొప్ప వాళ్ళు కాదు. వీధులలో తట్టా, బుట్టా పట్టుకుని పనిపాటల కోసం ఎదురు చూసే కూలీలను చూశాను.

బాట పక్కన కూర్చుని పూల దండలు తయారు చేసే వారిని, నెత్తిమీద తట్టలలో పళ్ళు, కూరగాయలు పెట్టుకుని వీధులలో.. ఇళ్ళమ్మట.. తిరుగుతూ అమ్ముకునే వారిని, చెరువులలో నుండి కావడితో నీళ్ళు మోసేవారిని, గానుగలలో నూనె తీసేవారిని, చెప్పులు కుట్టే వారిని, దేవాలయాల ముందు భిక్ష కోసం నిలబడి ఉన్నవారిని, ఎందరినో చూశాను,' అన్నాడు దేవయ్య.

నగరంలో బతకాలంటే. ఏదో ఒక పని చేసుకోవాలనే స్పృహ ఉన్నది ఈ ముగ్గురిలో ఒక్క దేవయ్యకే అని కామరాజు గ్రహించాడు.

అందుకని తన కూతుర్ని పెళ్ళాడడానికి దేవయ్యకే అర్హత అధికంగా వుందని భావించి తన అల్లుడ్ని చేసుకున్నాడు కామరాజు.





# చాదస్తాల యశోదమ్మ

రామయ్య గోపయ్యలిద్దరూ అన్నదమ్ములు. వారి చిన్నతనంలోనే తండ్రిపోయాడు. తల్లి యశోదే వాళ్ళనుపెంచసాగింది. ఆమెకు చాదస్తాలు మూఢనమ్మకాలు ఎక్కువ.

బడి ఈడు వచ్చిన రామయ్య గోపయ్య లను ఆమె బడికి పంపలేదు, బడికి పోతే పిల్లలు చచ్చిపోతారని ఆమెకు భయం. ఆమెకు రామయ్యా, గోపయ్యల కన్నా ముందుగా ఒక కొడుకుండేవాడట. వాడు బడికి వెళ్ళాకే చనిపోయాడట.

నిజానికి ఆ అబ్బాయి జబ్బు వచ్చి చని పోయాడు. కాని యశోదమ్మ పిల్లాడికి చదు వొచ్చాక చనిపోయాడని నమ్మింది. అందు వల్లే ఆమె రామయ్య గోపయ్యలను బడికి పంపలేదు.

రామయ్య - గోపయ్యలు పెద్దవాళ్ళ య్యారు. కూలీ నాలీ చేసి సంపాదించిన డబ్బులు తల్లి చేతిలో పెట్టేవారు. యశో దమ్మ ఆ డబ్బుతో రకరకాల పూజలు చేసేది. రకరకాల మొక్కులు దేవతలకు మొక్కేది. సోది చెప్పేవాళ్ళను ఇంటికి రప్పించి వాళ్ళను దానాలతో తృప్తి పరిచేది.

'ఎందుకమ్మా డబ్బునలా ఖర్చు పెడు తున్నావని ఎవరైనా అడిగితే కొడుకులకు మంచి రోజులు రావడం కోసమే' అని చెప్పేది.

కొడుకు లిద్దరికీ పెళ్ళీడు వచ్చింది. దూరపు బంధువుల పిల్లలతో పెళ్ళిళ్ళు చేసింది. ఇద్దరు కోడళ్ళ రాకతో ఆమెకు బోలెడు విశ్రాంతి లభించింది.

పనీ పాట లేని ఆమె పూజలతోనే సంతృప్తి పడక ఇంటికి బాబాలను సాధువులను పిలవడం ఆరభించింది. ఖర్చులు పెరగ డంతో ఆమె అప్పులు చెయ్యడం ప్రారం భించింది. ఆమె చేసిన అప్పులు తీర్చడానికి కొడుకులిద్దరు సతమతమవసాగారు.

బెలగాం భీమేశ్వరరావు



పెద్దకోడలు కమలకు అత్తచేసిన పనులు నచ్చలేదు. అత్త బుద్ధిని మార్చడానికి ఆమె ప్రయత్నించింది. కోడలి ఆలోచన పసిగట్టిన యశోదమ్మ, 'మీ మంచి రోజుల కోసం నేను పూజలు నాజలు చేస్తుంటే నీవు తప్పు పడతావా? దేవుడిగదికి వెళ్ళి తప్పయిందని లెంపలేసుకో!' అని కోడలిని మందలించింది.

అంతటితో ఊరుకోక కొడుకులు రాత్రి ఇల్లు చేరాక రభస చేసింది. కోడలు మరి నోరెత్తలేకపోయింది. ఎవరూ తనవైపు మాట్లాడలేదని బాధ పడింది.

రోజులు గడుస్తున్నాయి. యశోదమ్మ కోడళ్ళిద్దరు నెల తప్పారు. రోజుల తేడాతో ఇద్దరు మగ పిల్లలను కన్నారు. మనవలిద్దరకు బడివయసు వచ్చింది. పిల్లలిద్దరినీ బడికి పంపే ప్రయత్నాలు ఇంట్లో చేస్తుంటే యశోదమ్మ అడ్డు పలికింది. మనవలను బడికి పంపడం ససేమిరా వద్దంది.

అత్తగారి నోటి నుంచి వచ్చిన ఆ మాటలు విని కమల కొయ్యబారిపోయింది. కొడుకులిద్దరు తల్లిమాటకు ఎదురుచెప్పక పోయేసరికి ఆమెకు కోపం నసాళానికెక్కింది.

'మీ అమ్మగారి చాదస్తాలు మరీ ఎక్కువవుతున్నాయి. ఆమె చాదస్తంతో మీకెలాగూ చదువు లేదు. మన పిల్లలకు కూడా చదువును దూరం చేయాలని ఆమె అనుకుంటుంది. ఇలా అయితే నేనీ ఇంట్లో ఉండలేను!' గట్టిగానే చెప్పింది.

మంచం మీద కూర్చున్న యశోదమ్మ చివాలున మంచం నుంచి దిగి, 'చిన్నా పెద్దా లేకుండా ఆ వాగుడేమిటి ? నీకు వినాశ కాలం దాపురించింది. అందుకే అలాగపేలిపోతున్నావు! దేవుడూ దెయ్యమూ అంటే కాస్త భయమూ భక్తీ ఉండాలి ! పెద్దవాళ్ళు అనుభవంతో చెప్పే మాటలను గౌరవించాలి !' అని విరుచుకు పడింది.

కోడలికీ అత్తకూ మాటామాటా పెరిగింది. రామయ్య ఎంత సర్ది చెప్పినా ఇద్దరి మధ్య వాదన తెగలేదు. చివరకు వాదన వేరుకాపురం వరకు వచ్చింది. మనస్సులు కలవనప్పుడు దూరంగా ఉండడమే శ్రేయస్కరమని పక్కఊర్లో కాపురం పెట్టాడు రామయ్య.

కమల భర్తను తన దారికి తెచ్చి ముందు పిల్లాడిని బడిలో చేర్పించింది. పిల్లాడు బడికెళ్ళి వస్తుంటే రామయ్య ఎంతో ఆనందించాడు. రోజులు కూడా రామయ్యకు కలిసొ

చ్చాయి. కూలి డబ్బులు బాగా అందేపనులు దొరికాయి. నాలుగు డబ్బులు వెనకేసుకొని ఊరి చివర స్థలం చౌకగా ఆ దంపతులు కొనుక్కున్నారు. కొన్నాళ్ళకు చిన్న ఇల్లు కూడా కట్టుకున్నారు.

కమల సోమరిగా కూర్చోలేదు. పెరటి జాగా బాగు చేసింది. వానాకాలం రాగానే ఆమె అనప, గుమ్మడి, బీర, పొట్ల పాదులు వేసింది. తొందరగా కాపుకు వచ్చే కొబ్బరి మొక్కలు నాటింది.

యశోదమ్మకు వాళ్ళద్వారా వీళ్ళద్వారా రామయ్య కుటుంబ విషయాలు తెలిశాయి. ఆమెకు ఒళ్ళు మండింది. కోడలి వల్లనే కొడుకు మారిపోయాడని కోడలకు శాపనార్థాలు పెట్టింది.

బడికి వెళ్ళడం వల్ల మనవడు చచ్చిపోతాడని రాగాలు పెట్టింది. రామయ్యను తనను కలవమని కబురు పంపించింది.

అతడు వచ్చాక, 'మన కుటుంబానికి అచ్చిరానివన్నీ నీ పెళ్ళాం చేస్తుంది. నీవు నష్టపోతావు నీ ప్రాణం నీకొడుకు ప్రాణం హరీమంటాయి, అని పెచ్చరించింది.

రామయ్య మనసులో నవ్వుకున్నాడు,. తల్లితో నెమ్మదిగా, 'అచ్చిరాదంటూ పని కొచ్చే ఏ పనీ చెయ్యనివ్వకుంటున్నావు. పూర్వకాలంలాగా ఈ కాలంకాదు. చదువు తప్పని సరి. సంపాదన తప్పనిసరి.

ఆ రోజుల్లో నీవు పెరట్లో మొక్కలు నాటడం ఆ సమయంలోనే నాన్న చనిపోవడం కాకతాళీయంగా జరిగిన సంఘటనలు. చిన్నతనం కదా మంచి చెడ్డలు మాకంతగా అప్పుడు తెలియలేదు. పెద్దయ్యాక



ఊళ్ళో వాళ్ళు అనుకుంటే నాన్న ఒక తాగుబోతనీ విసుగు విరామం లేకుండా తాగి తాగి గుండె ఆగి చనిపోయాడని విన్నాం.

సారాయి తాగడం వల్లనే నాన్న చనిపోయాడు. కాని పెరట్లో పాదులు మొక్కలు వెయ్యడం వల్ల కాదని నేనూ, కమలా నమ్ముతున్నాం. అందువల్లే మేము తెగించి బాగుపడడానికి కొత్తదారులు వెతుకుతున్నాం!' అని అన్నాడు.

కొడుకు మాటలు విని యశోదమ్మ తోక తొక్కిన పామయింది. కొడుకును నానా తిట్లు తిట్టి 'కనిపించకు పో' అని అంది. తమ్ముడు మరదలు అక్కడే ఉన్నారు కాని వారు జోక్యం చేసుకోలేదు .

రామయ్య మనస్సు బాధపడింది. అక్కడ మరి ఒక్క క్షణం ఉండకుండా ఇంటిదారి పట్టాడు.

కాలం గడుస్తోంది. ఐదు సంవత్సరాలు గడిచాయి.

రామయ్య దంపతులు పూర్తిగా పేదరికానికి దూరమయ్యారు. పెరటిలో వేసిన కొబ్బరి చెట్లు అందుకొచ్చాయి. కాయగూరల పంట దిగుబడి అధికమయ్యింది.

రోజూ కమల కొబ్బరికాయలు కాయగూరలమ్మకం వల్ల రాబడి పెరిగింది. తిండికి గుడ్డకు వాళ్ళకు కరువులేకపోయింది. పిల్లాడు మంచి బడిలో చదువుకోసాగాడు.

రామయ్య తమ్ముడు గోపయ్య పరిస్థితి సొంత ఊర్లో దీనంగా మారిపోయింది. తల్లి చాదస్తాలకు మూఢనమ్మకాలకు అతడి కుటుంబం బలయ్యింది.

చదువూ సామూ లేక అతడి కొడుకు జులాయయ్యాడు. గోపయ్య తెచ్చుకుంటున్న రోజూ కూలి కుటుంబానికి సరిపోయేదికాదు. ఇల్లు గడవడం కష్టమయింది.

గోపయ్య ఆలోచనలో పడ్డాడు. అన్నయ్యకన్నా తన బతుకు ఎందుకు వెనుక బడిందో గ్రహించాడు. తల్లి మూఢనమ్మకాలు చాదస్తాలు ఆమె అమాయకత్వంవల్ల ఏర్పడినవే అని తెలుసుకున్నాడు.

ఒకరోజు తల్లితో, 'అమ్మా! అన్నయ్యల బాటలోనే నేనూ నడుస్తాను. మా జీవితాలను బాగుచేసుకుంటాం. మన ప్రయత్నముంటేనే దేవుని దీవెన ఉంటుంది. ఏకంగా దేవుని మీదే భారం వేసి కూర్చుంటే ఫలితముండదు. ప్రతీదీ అచ్చిరాదని పాతదారిలోనే పయనిస్తే మనమెప్పుడు జీవితంలో ముందుకెళ్ళగలం?' నిలదీసినట్టే అడిగాడు.

ఆ మాటలు గోపయ్య నోటి నుంచి విని యశోదమ్మ దిగ్భ్రాంతురాలయింది. కాస్సేపు నోటమాట లేకుండా చేష్టలుడిగిపోయింది. ఏమనుకుందో ఏమో కొంత సేపయ్యాక 'నీ ఇష్టం! మీ కొత్త ఆలోచనలకు నేనడ్డురాను!' అంది.

గోపయ్య దంపతులు ఆనందించారు. కొన్నాళ్ళకు అందరి శ్రమతో ఆ ఇల్లు కూడా సిరిసంపదలకు లోటు లేకుండా అభివృద్ధి చెందింది.



# కష్టేఫలి

కంచిపేటలో నివసించే కూర్మయ్యకు రాజభోగాలంటే ఎక్కువ. నిత్యమూ కలలు కంటూ సమయం వృథాగా గడిపేస్తూ ఉంటాడు. రాజ కుటుంబీకులంతా భోగ, భాగ్యాలతో తుల తూగుతూ కష్టమంటే తెలియకుండా జీవితం సుఖంగా అనుభవిస్తూ ఉంటారనేది అతని విశ్వాసం. కూర్మయ్య పొరుగునే ఉండే కేసరి మాత్రం ఇందుకు పూర్తిగా విరుద్ధం. కష్టాన్ని మాత్రమే నమ్ముకుని చెమటోడ్చి సంపాదించడంలోనే సుఖముందని నమ్మేవాడు.

ఒకనాడు కూర్మయ్యకు యువరాజులా వేషం ధరించి పురవీధుల్లో ఊరేగాలనే కోరిక కలిగింది.. అదే తడవున వేషం మార్చుకుని, ఒక అశ్వాన్ని అధిరోహించి చుట్టుపక్కల గ్రామాల్లో తిరగసాగాడు.తనని చూసి సామాన్య ప్రజలు గౌరవంగా తప్పుకుంటుంటే, భక్తితో నమస్కరిస్తుంటే మనసులోనే ఆనందించసాగాడు కూర్మయ్య.

తిరిగి, తిరిగి అలసిన కూర్మయ్య చీకటి పడుతుండగా కంచిపేట కేసి వెనుదిరుగాడు. మార్గమధ్యంలో అడవిని దాటుతుండగా అతడ్ని దొంగలముఠా చుట్టుముట్టింది. మేడిపండులా డాబూ, దర్పంతో కన్పించిన కూర్మయ్య వద్ద ఏమీ దొరక్కపోవడంతో అసలు సంగతి గ్రహించిన దొంగలు కోపంతో అతడికి తగిన రీతిలో దేహశుద్ధి గావించి, అశ్వాన్ని లాక్కుని ఖరీదైన దుస్తులు సైతం తస్కరించి విడిచిపెట్టారు.

'బ్రతుకు జీవుడా' అనుకుంటూ ఇంటికి చేరుకున్నాడు కూర్మయ్య. విషయం తెలుసుకున్న కేసరి, కూర్మయ్యతో, 'రాజుగారికీ, వారి కుటుంబీకులకు మనకున్నంత స్వేచ్ఛ ఉండదు. వారికి బాధ్యతలు, శత్రుభయం అధికం. అంతేకాదు, వాళ్ళకుండాల్సిన కష్టాలు వాళ్ళకి ఉండనే ఉంటాయి. దూరపు కొండలు నున్నగానే కనిపిస్తాయి. కాబట్టి నీకున్న భ్రాంతిని విడిచిపెట్టి వాస్తవంలో జీవించడం నేర్చుకో,' అని హిత వచనాలు పలికాడు.

అప్పట్నించీ కూర్మయ్య డాబూ, దర్పం, ఆడంబరాలు, రాజభోగాల పట్ల మోజు కేవలం ఆలోచనల వరకే పరిమితంచేసుకుని బుద్ధిగా కష్టపడి జీవించసాగాడు. – ఎం. మురళీ మోహన్





# పంచతంత్ర కథలు

పిచ్చుకా, వడ్రంగి పిట్టా, తుమ్మెదా కలిసి కప్పను చూడబోయాయి. కప్ప అంతా విని, 'మనలాటి గొప్పవాళ్లు పూనుకుంటే ఈ ఏనుగు లాటి పరమ మూర్ఖుణ్ణి కడ తేర్చటమెంత పని మిత్రమా, తుమ్మెదా, నువు ఝుంకారం చేస్తూ వెళ్లి, ఏనుగు కళ్లముందు ఎగురుతూ, కుట్టటానికి ప్రయత్నాలు చెయ్యి.

ఏనుగు భయపడి కళ్లు మూసుకుంటుంది. అప్పుడు వడ్రంగి పిట్ట దాని కన్ను ఒకటి పొడిచేస్తుంది. ఏనుగు కంగారు పడి రెండో కన్ను కూడా మూసుకుని పరిగెత్త నారంభిస్తుంది. అప్పుడు వడ్రంగిపిట్ట దాని వెంటపడి రెండో కన్ను కూడా పొడిచేస్తుంది. ఏనుగు నీటిమడుగులో చేరదామని వెర్రిగా అటూ ఇటూ పరిగెత్తుతుంది. అప్పుడు నేను ఒక అగాధం అంచున కూర్చుని బెకబెకలాడతాను. నేను అరిచే దిక్కుగా నీటిమడుగు ఉన్నదనుకుని, ఏనుగు పరిగెత్తుకుంటూ వచ్చి, అగాధంలో పడి చచ్చి ఊరుకుంటుంది. ఆవిధంగా దాని పీడ విరగడై పోతుంది,' అన్నది.

కప్ప చెప్పినట్టే చేసి, తుమ్మెదా వడ్రంగి పిట్టా కలసి, ఏనుగును అగాధంలో పడేసి చంపేశాయి.

తన భార్య చెప్పిన పిచ్చుకా-ఏనుగూ కథ విని ఉల్లంకిపిట్ట, 'సరే నేను ఈ రోజునే నా మిత్రులందరినీ సమావేశపరుస్తాను. తరవాత అందరమూ కలిసి సముద్రాన్ని ఎండగట్టేస్తాం.' అన్నది.

అది పక్షులన్నిటినీ పిలిచి, సముద్రం తమ గుడ్లకు చేసిన అన్యాయం గురించి

మిత్రభేదం-20

చెప్పింది. పక్షులన్నీ తమ ముక్కులోకి సముద్రజలాన్ని తీసుకుని, సముద్రంలో నీరు లేకుండా చెయ్యటానికి ప్రయత్నిం చాయి.

కాని అందువల్ల ఫలితం ఏమీ లేకపోగా, అవి సముద్రాన్ని తమ రెక్కలతో కొట్టాయి. అందువల్ల కూడా ఫలితం లేకపోయేసరికి, అవి మట్టి బెడ్డలను తెచ్చి వేసి, సము ద్రాన్ని పూడ్చ్చయత్నించాయి.

అప్పటికీ ఫలితం లేకపోవటం చూసి, ఒక వివేకం గల పక్షి, 'చూడండి! మనంతట మనం సముద్రాన్ని కాళ్లబేరానికి తీసుకు రాలేం. మర్రిచెట్టు కింద ఒక ముసలి బాతు ఉన్నది. అది మనకు తగిన సలహా ఇస్తుంది. అది ఒకప్పుడు తన సలహాతో ఒక బాతులమందను బోయవాడి ఉచ్చుల నుంచి విడిపించింది. అందుచేత మనం దాని సలహా అడుగుదాం,' అన్నది.

ఏమిటా కథ? అని ఇతర పక్షులు అడి గాయి. వివేకం గల పక్షి ఇలా చెప్పింది:

### ముసలిబాతు కథ

ఒక అరణ్యంలో ఒక మహా వృక్షం ఉండేది. దానికి లెక్కలేనన్ని శాఖలు ఉండేవి. ఆ చెట్టు మొదట్లో ఒక లత మొలిచి పెరగ నారంభించింది.

ఒక ముసలిబాతు ఆడబాతులతో, 'ఈ లత చెట్టు పైకి ఎగబాకితే, దాని సహాయంతో శత్రువులు చెట్టు పైకి ఎక్కగలుగుతారు. అందుచేత మనం ఇప్పుడే ఈ లతను తుంచేద్దాం,' అన్నది.

ఆడబాతులు నవ్వి, 'ఈ లత మనని ఏమి చెయ్యగలదు?' అన్నాయి.



లత చెట్టుపైకి ఎగబాకింది. ఒకనాడు ఒక బోయవాడు ఆ లత సహాయంతో చెట్టు మీదికి ఎక్కి, బాతులన్నీ ఆహారం కోసం వెళ్ళి ఉన్న సమయంలో ఉచ్చులు పన్నాడు.

తిరిగి వస్తూనే బాతులన్నీ ఉచ్చులలో చిక్కుకుపోయాయి. అవి తప్పించుకునే టందుకు చేసిన ప్రయత్నాలు వ్యర్థమ య్యాయి.

'నా మాట వినక ఈ దుస్థితి తెచ్చుకు న్నారు,' అన్నది ముసలిబాతు.

'అది నిజమే. ఇప్పుడు ఈ ఆపద తప్పే ఉపాయం చెప్పు,' అన్నాయి మిగిలిన బాతులు.

'ఇప్పుడు మనమంతా కదలకుండా పడిపోయి, చచ్చినట్లు నటించుదాం. తర వాత బోయవాడు వచ్చి మనమంతా చచ్చా మనుకుని, ఒక్కొక్కరినే ఉచ్చు నుంచి తీసి కింద పడేస్తాడు. చిట్టచివరి పక్షి కింద పడినదాకా కదలకుండా ఉండి తరవాత అందరమూ ఒక్క పెట్టున ఎగిరిపోదాం,' అన్నది ముసలిబాతు.

మర్నాడు ఉదయం బోయవాడు వచ్చి పక్షులన్నీ చచ్చాయనుకుని, ఉచ్చులు విప్పి, నిశ్చింతగా ఒక్కొక్క బాతునే కింద పడేయసాగాడు. అన్నిటినీ పడేసి వాడు చెట్టు దిగి రాబోతుండగా, అన్ని బాతులూ ఒక్కసారిగా లేచి ఎగిరి పోవడం చూసి వాడికి అమిత ఆశ్చర్యం కలిగింది.

ఈ కథ విన్న మీదట పక్షులన్నీ వెళ్ళి ముసలిబాతును కలుసుకుని, సముద్రం పొంగి ఉల్లంకిపిట్ట పెట్టిన గుడ్లను కాజే సిన విషయమంతా చెప్పాయి.

'మనమంతా కలిసి, మనకు రాజూ, మహావిష్ణువుకు వాహనమూ అయిన గరుత్మంతుండి దర్శనం చేసుకుందాం. అతను జాలిగుండె గలవాడు,' అన్నది ముసలిబాతు. (ఇంకా ఉంది)






# సమభావం

ఒకప్పుడు గురుగోవిందు నిండుకొలువులో వుండగా, సేవకులు ఒకనిని దర్బారులోకి తీసుకువచ్చి, ఆయన ఎదుట నిలబెట్టారు.

'ప్రభూ ! - ఈతని పేరు 'కన్హయా'. ఇతను పరమ ద్రోహి అని తెలియటం చేత, దేవర ఎదుటకు తీసుకవచ్చాము,' అని చెప్పారు.

కన్హయా మర్యాదస్థుడు, ఉదారుడు, మంచి హృదయం కలవాడు. ఈ సంగతి గురుగోవిందుకు బాగా తెలుసు. 'సరే. ఇతను చేసిన తప్పేమిటి?' అని గురుగోవిందు వాళ్ళను అడిగాడు.

'ప్రభూ! మన వీరులు వెళ్ళి ఒక వరసనించి శత్రుసైనికులను సంహరిస్తూవుంటే, కొనప్రాణాలతో వున్న ఆ ముస్లిం సైనికుల గొంతుకలో నీళ్ళు పోస్తాడట ఈయన. మహరాజ్, ఎలా వుందో ఈ స్వామిద్రోహం చూడండి!' అని వాళ్ళు విన్న వించుకొన్నారు.

ఈ మాటలు వినగానే, గురుగోవిందు కన్హయాను పిలిచి, -- 'ఏమి చెబుతావయ్యా?' అని ప్రశ్నించాడు.

అందుకు కన్హయా ఇలా సమాధానం చెప్పాడు: 'నేను యుద్ధ రంగంమీద ఉండగా, నా దృష్టికి హిందూ సైనికులెవరో, ముస్లిం సైనికులెవరో తేడాయేమీ తెలియకుండా వుంది. క్షతగాత్రుడయిన ప్రతి వీరునిలోనూ నాకంటికి దైవస్వరూపమే కనిపిస్తుంది. అందుచేత, వారు

వీరు అనేభేదం పాటించక, వీరుడన్నవాడి కల్లా నా చేతనైనట్టుగా సేవచేసుకొంటు న్నాను. ఇదే నా వల్ల జరిగిన తప్పు.'

అమృత తుల్యాలైన ఈ పలుకులు గురు గోవిందుకు మేరలేని సంతోషాన్ని కలిగించినై. వెంటనే కన్హయాను చేరదీసు కొని ఆయన ఆశీర్వదించాడు.

అంతే కాదు. తన పెట్టెలోనించి ఒక డబ్బా తీసి కన్హయాకు ఇచ్చి 'నాయనా! - పడిపోయిన వీరులకు - ఆ వీరులు ఏజాతికి చెందినాసరే - నీళ్ళివ్వటమే కాదు. ఈ తైలం తీసుకుని, వారి గాయా లకు రాసి, కట్లు కట్టి నయం చెయ్యి. జ్ఞానివైన నీవు ఒక్క సంగతి జ్ఞాపకముం చుకో - ఇప్పుడీ యుద్ధంలో పోరాడు తున్నది. హిందువులూ ముస్లిములూ కాదు. ఎంతమాత్రమూ కాదు. ధర్మ దేవత బయల్దేరి అధర్మాన్ని అణిచివేయ టానికి యత్నిస్తున్నది. ఈ సంఘర్షణే లేకుంటే, మనందరమూ ఒక్కటే. మనలో మనకు భేదం లేదు, ద్వేషమూ లేదు,' అని బోధచేశాడు.

గురువాజ్ఞ ప్రకారం ప్రియశిష్యుడైన కన్హయా ఆ తైలండబ్బా చేతపుచ్చుకొని, మానవసేవ చేసి తరించటానికి మళ్ళీ యుద్ధరంగానికి బయల్దేరాడు.

తక్కిన శిష్యులందరూ కన్హయాను చూచి ఆశ్చర్యపోయారు. అప్పటినుంచి ఆయనని అనుసరించి తరించటానికే వారు ప్రయత్నించారు.





# కోడి కెలుకుడు రహస్యం

పూర్వ కాలమందు గ్రద్దకు ఇప్పటిలాగ రెక్కలు ఉండేవికావు. అందుచేత అది ఎగురలేక పోయేది. జంతువులతో పాటు అది కూడా భూమిమీదనే సంచరించవ లసి రావటం దానికి ఇబ్బందిగా తోచింది.

అప్పుడు గ్రద్ద ఘోరమైన తపస్సు చేసి పరమేశ్వరుణ్ణి ప్రత్యక్షం చేసుకుని ఆయ నకు నమస్కరిస్తూ, 'దేవా! నేను ఈ భూ లోకంలో మాత్రమే సంచరించటం స్వేచ్ఛకు లోపంగా ఉన్నది. కనుక ఆకాశ మార్గాన విహరించటానికి వీలుగా రెక్కలు అను గ్రహించి, పుణ్యం కట్టుకోవలసింది,' అని వేడుకుంది.

గ్రద్ద ప్రార్థన విని దేవుడు, ఒక మహిమ గల సూదిని దానికి ప్రసాదిస్తూ 'ఓయి గ్రద్దా! -- నీకు ఇష్టమైన రెక్కలూ, ఈకలూ, సంపాదించి తెచ్చుకుని, ఈ సూదితో కుట్టుకున్నావంటే శాశ్వతంగా అతుక్కుపోతై. అప్పుడు తక్కిన అన్ని పక్షులలాగా నీవుకూడా స్వేచ్ఛగా ఆకాశ మార్గాన ఎగురగల్గుతావు,' అని చెప్పి, అదృశ్యమయ్యాడు.

దేవుడిచ్చిన మంత్ర సూదితో గ్రద్ద రెక్కలూ ఈకలూ అమర్చుకుని ఇష్టం వచ్చినట్టుగా ఎగురజొచ్చింది.

గ్రద్ద ఎగరటం చూచి, దాని ప్రాణ స్నేహితుడైన కోడికి కూడా ఆకాశ మార్గాన ఎగురాలని సరదా పుట్టింది. గ్రద్ద దగ్గరకు వెళ్ళి కోడి, తనకు కలిగిన అభిలాషను వెల్లడించింది.

ఈ సంగతి విని గ్రద్ద 'ఓయి నేస్తం ! - ఈ మంత్ర సూదిని నేను కఠోరమైన

ఆర్. మాణిక్యాంబ

తపస్సు చేసి సంపాదించుకుని ప్రాణ సమానంగా చూచుకుంటున్నాను. కనుక, ఇది తప్ప మరేమికోరినా తప్పక నీకోరిక నెరవేరుస్తాను. నా ప్రాణాలు కోరినా ఇవ్వ టానికి సిద్ధమే,' అని నమ్మబల్కింది.

అందుకు కోడి 'నాకు జీవితంలో మిగి లివున్న కోరిక ఇది ఒక్కటే. నీ దయవుంటే మిత్రుని కోరికనెరవేర్చు. లేకుంటే లేదు. నీవు మాట చెల్లిస్తావనే గట్టి నమ్మికతో ఇంత దూరం వచ్చాను. నోరు తెరిచి ఆడి గాను. ఒక్క నాలుగు రోజులు సూది ఎరువిచ్చావంటే రెక్కలు అమర్చుకున్న వెంటనే నీసూది నీకు పువ్వుల్లో పెట్టి వప్ప గిస్తాను,' అని అనేక విధాల ప్రాధేయ పడింది.

మారుమాట చెప్పలేక గ్రద్ద మంత్ర సూది ఇస్తూ అనేక విధాల హెచ్చరిక చేసింది. అమిత సంతోషంతో కోడి మంత్ర సూది పట్టుకపోయింది కాని, ఆ ఉత్సా హంలో దారిలో ఎక్కడో దానిని జారవిడి చింది. ఆ క్షణం నించి కోడికి మతిపోయి, ప్రాణ స్నేహితుడైన గ్రద్దకు ఏం సమా ధానం చెప్పుకోవటానికి తోచలేదు.

సరీగా నాలుగో రోజున గ్రద్ద తన మంత్ర సూది కోసం కబురు చేసేసరికి, 'కోడి ఇదిగో ఇస్తాను, అదిగో ఇస్తాను,' అంటూ గడువు పెట్టి, ఆ సూది దొరుకు తుందేమోనని నాటికీ నేటికీ కుటుం బంతో సహా నేలను కెలుకుతూ, ఇంకా వెతుకుతూనే వుంది.

కోడి తనను మోసంచేసి, మంత్ర సూది కాజేసి, ఇలా నటన చేస్తూ వుందనే ఆపో హతో, గ్రద్ద దాని జట్టు వదిలేసి, దానిపైన వైరం పూనింది.

అప్పటినించీ కోళ్ళుగానీ, కోడిపిల్లలు కాని కంటబడితే, గ్రద్ద వాటిని ఆకాశానికి ఎగరేసుకుపోయి, కసితీరేట్టు కబళించి వేయాలని చూస్తూంటుంది.





# మంత్రీ - మడేలూ

పూర్వం ఒక రాజుగారి కొలువులో పేరన్న అనే మడేలు (చాకలి) ఉండేవాడు.

పేరన్నకు నెల జీతం ఒక వరహా. మంత్రికి రెండు వందల వరహాలు. నెల నెలా రెండేసి వందల వరహాలూ రాజు గారు ఖజానాలోంచి తెప్పించి మంత్రి చేతుల్లో పోస్తుంటే, దగ్గిరే వుండి చూస్తోన్న పేరన్నకి బాధగా ఉండేది. రోజు ఇరవై నాలుగుగంటలూ తను రాజుగారికి అడ్డమైన చాకిరీ చేస్తూవుండె. తనకి ఒక్క వరహాయేనా వచ్చేది? గంటో రెండు గంటలో ఉండి, ఆ కాగితం యీ కాగితం చూసీ చూడనట్లు తిరగేసి, రాజుగారితో కాస్సేపు మంతనాలాడి చక్కాబోయే మంత్రికిరెండువందల వరహాలా! తనకూ మంత్రికీ జీతంలో ఇంత అంతరం ఎందు వల్లనో ఎంత ఆలోచించినా పేరన్నకు అర్థం అయిందికాదు.

పేరన్న ఉండబట్టలేక ఒకనాడు రాజు గారిని ఈ సంగతి అడిగేశాడు.

వాడి మాటలను, రాజు శాంతంగా విన్నాడే కాని జవాబు ఏమీ చెప్పలేదు. కాని ఆయన మనస్సులో ఏదో ఆలోచించుకున్నాడు.

ఆ సాయంకాలమే రాజుగారు పేరన్నను వెంటబెట్టుకుని షికారు బయల్దేరారు.

వారికి రెండు ఫర్లాంగుల దూరంలో కోనేటి గట్టుమీద జనం గుంపుకూడి సందడిగా కనపడ్డారు.

అప్పుడు రాజుగారు మడేలుతో, 'పేరన్నా, అదేమిటో చూసిరా,' అన్నారు.

అఖండం సుబ్బులక్ష్మి



పేరన్న కోనేటి ఒడ్డుకి పరుగెత్తి వెళ్ళేడు. వాడు తిరిగి వచ్చేటప్పటికి పదిహేను నిముషాలైంది.

'ఏమిటి పేరన్నా విశేషం?' అని అడిగారు రాజుగారు.

'పగటి వేషగాళ్ళుటండి. జనం వాళ్ళ చుట్టూ మూగి కబుర్లు వింటున్నార' న్నాడు పేరన్న.

'ఏ ఊరినుంచి వచ్చారీ వేషగాళ్ళు?' అని రాజు అడిగేసరికి, పేరన్న సమాధానం చెప్పలేక పోయాడు. 'చెరువుగట్టు మీదకు వెళ్లినప్పుడు వాడా సంగతి కనుక్కోలేదు. వెళ్ళి కనుక్కు వస్తాను,' అంటూ మళ్ళీ మళ్ళీ ఒక పావుగంటకు తిరిగి వచ్చాడు.

"ప్రభూ, ఈ వేషగాళ్ళు కూచిపూడి నుంచి వచ్చారుటండి.' అన్నాడు.

ఈ సమాధానం విని రాజు ఊరుకోలేదు. 'ఓహో, కూచిపూడి భాగవతులా వచ్చినవాళ్ళు? ఐతే దివాణంలోకి రప్పించాలే ! సరేకాని పేరన్నా, వీళ్ళు మన ఊళ్ళో ఎంతకాలం ఉంటారో?' అని అడిగారు రాజుగారు.

కాని ఆ సంగతి పేరన్నకేంతెలుసు? వాళ్ళని వీడు అడగాలేదు; వాళ్ళు చెప్పాలేదు. 'ఉండండి బాబూ, ఆసంగతి కూడా కనుక్కుని వస్తాను,' అంటూ మళ్ళీ చెరువు ముఖం పట్టేడు. తిరిగి వచ్చేటప్పటికి ఈ మాటు పావుగంటకన్న ఎక్కువే పట్టింది.

'వారం పదిరోజులు దాకా ఉంటారుట ప్రభూ,' అని చెప్పాడు.

'అట్లైతే మనం వేటకు వెళ్ళి తిరిగి వచ్చేవరకూ ఉంటారన్నమాటే. ఔను కాని వాళ్ళు ఏమైనా కొత్తనాటకాలూ, వేషాలు నేర్చుకున్నారా, లేక అన్నీ మనం చూసేసినవేనా?' అని మళ్ళీ అడిగాడు రాజు.

ఆ సంగతి పేరన్న కెలా తెలుస్తుంది? తెలుసుకోవాలంటే 'దేముడా' అంటూ చెరువు గట్టుకి మళ్ళీ ఒక మాటు వెళ్ళి రావలసిందే. 'సెలవైతే కనుక్కొస్తాను' అన్నాడు పేరన్న. 'అది మనం ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయం పేరన్నా.

ఏమంటే, వీళ్ళు కొత్త విద్యలేమీ నేర్చి ఉండకపోతే వీళ్ళని దివాణంలోకి పిలిపించనే అక్కర్లేదు.' అన్నారు రాజుగారు.

'చిత్తం. వెళ్ళి వస్తానండి అట్లైతే' అంటూ వెళ్ళాడు పేరన్న.

పేరన్న వెళ్ళి వచ్చేటప్పటికి మళ్ళీ అరగంటసేపు పట్టింది. నాలుగుమాట్లు వెళ్ళి రావటంలో మొత్తం గంటకు పైగా కాలం వ్యయమైంది. ప్రతీమాటూ రెండేసి ఫర్లాంగులు వెళ్ళి రావటం. మొత్తం రెండు మైళ్ళు పరుగెత్తేటప్పటికి పేరన్నకి చెమటపట్టి ఆయాసం కూడా వచ్చింది.



రొప్పుతూ.. రోజుతూ.. తిరిగివచ్చిన పేరన్న, 'ప్రభూ, కొత్తనాటకాలు, కొత్త వేషాలు, ఎన్నో నేర్చారుటండి,' అన్నాడు.

'ఇంకనేం? అట్లయితే నాటకాలు, వేషాలు. తప్పకుండా వేయిద్దాం. మరైతే ఈ సంగతి వాళ్ళకు చెప్పేవా' అని తిరిగి ప్రశ్నించారు రాజుగారు.

'ఏ సంగతి బాబయ్యా ?' అన్నాడు పేరన్న, 'మళ్ళీ వెళ్ళిరావాలి కామాలు దేవుడా' అని అనుకొంటూ.

'వాళ్ళు యీ ప్రాంతం విడిచి వెళ్ళే లోపుగా మన దర్శనం చేసి, దివాణంలో తమ విద్య ప్రదర్శించవలసి ఉంటుందన్న సంగతోయ్.' అన్నారు రాజుగారు.

'తమ శెలవు అవందే ఎలా చెప్పటం ప్రభూ?' అన్నాడు పేరన్న.

'మించిపోయింది లేదులే. ఇప్పుడైనా పోయి చెప్పి రావచ్చు.' అన్నారు రాజుగారు.

రాజుగారు తనని మళ్ళీ చెరువు గట్టుకి పంపిస్తున్నారనటంతోనే పేరన్నకి ప్రాణం విసిగిపోయింది. 'ఇదేమిటి ఈ రోజున రాజుగారు ఇలా వేపుకొని తింటున్నారు? ఇది వరకు ఎన్నడూ నాకు ఇలాంటి తకమకలు లేవే. విసనకర్ర పుచ్చుకొని విసరటం, పక్కలు వెయ్యటం, బట్టలు ఉతికి ఆరవేసి మడతలు పెట్టటం, ఇలాంటి పనులెన్నో చేస్తున్నానుగాని ఎన్నడూ ఇంత శ్రమ పడలేదు. ఒక్క పనికి ఇన్ని మాట్లు తిప్పడమా?' అనిపించింది పేరన్నకి.

మరో రెండు నిమిషాలకి మంత్రి అక్కడకు వచ్చాడు. రాజుగారు మంత్రికి చెరువు గట్టుమీద ఉన్న జనం గుంపు చూపించి, సంగతేమిటో కనుక్కురమ్మని పంపేరు.

మరికాసేపటికి మంత్రి చెరువు గట్టు నుంచి తిరిగి వచ్చి, 'ప్రభూ, కూచిపూడి నుంచి భాగవతులు వచ్చారు. వారు చెపుతూ ఉన్న హాస్యపుమాటలు వింటూ జనం అంతా పోగయారు. ప్రభూ, ఈ భాగవతులు మన గ్రామంలో పదిరోజుల వరకూ ఉంటారట.

ఎన్నో క్రొత్త క్రొత్త వేషాలూ, నాటకాలు నేర్చేమన్నారు. 'మా ప్రభువులు రేపు వేటకు వెళ్ళ నిశ్చయించారు. రెండు మూడు రోజులలో తిరిగి వస్తారు. అప్పుడు మీరు వచ్చి ప్రభువుల దర్శనం చేసుకోండి' అని భాగవతులతో చెప్పి వచ్చాను. వీలును బట్టి ప్రభువులు వారి ప్రదర్శనాలు చిత్తగించవచ్చును' అని రాజుగారికి మనవి చేశాడు.

రాజుగారు మంత్రికి సెలవిచ్చి పంపి, 'పేరన్నా, చూశావా? సంగతి ఏమిటో కనుక్కుని రమ్మనే సరికి మంత్రి వెళ్ళి ఒక్క మాటుగా ఎన్ని వివరాలు కనుక్కు వచ్చాడో. ఇన్ని వివరాలు కనుక్కోవాలనే మాటే అసలు నీకు తోచలేదు. నేను పొద్దస్తమానం అడుగుతూ ఉండడం, నువ్వు వెళ్ళి వస్తూ ఉండడం జరిగింది. తెలుసుకోవలసిన సంగతులు అన్నీ తెలుసుకోవటమే గాకుండా, మంత్రి వాళ్ళని ఆహ్వానించాడు కూడా. ఆహ్వానించాడే కాని,' మీరు నాటకాలు వేద్దురుగాని. రాజుగారు చూస్తారు 'అని వాళ్ళకి ఏవిధమైన మాటా ఇవ్వలేదు. నీకు మంత్రికీ గల తేడా ఇప్పుడైనా తెలిసిందా?' అని అడిగారు రాజుగారు.

మడేలు తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు.





# బూచిబావి

రామాపురంలో ధర్మయ్య అనేరైతు తనకున్న కొబ్బరి తోటలో ఇల్లుకట్టుకుని, పొలంలో వరి పండించుకుంటూ జీవిస్తున్నాడు. ఒకనాటి మధ్యాహ్నం తోటలో పని ముగించుకొని వస్తూండగా ఒక నల్లని రాయి తళ తళా మెరుస్తూ అతని కంట బడింది. దాన్ని చూసి అతను ముచ్చట పడి ఇంటికి తెచ్చి భద్రంగా పెట్టెలో అడుగున దాచి పెట్టాడు.

ధర్మయ్య భార్య గౌరమ్మకు ఆరోగ్యం సరిగ్గా ఉండటం లేదు. ఇంటి పనంతా ఆమె ఒక్కటే చేసుకోలేక పోతుంది. తోట నుండి ఇంటికి వచ్చిన భర్తకు అన్నం వడ్డిస్తూ గౌరమ్మ కొద్ది రోజులు పనిమనిషిని పెట్టుకుందామని అడిగింది. ధర్మయ్య కూడా సరేనన్నాడు. భోజనం ముగించి ధర్మయ్య కాసేపు నడుం వాల్చాడు. కునుకు పట్టిందో లేదో వీధి తలుపు ఎవరో తడుతున్నట్లుగా చప్పుడయింది.

ధర్మయ్య లేచి వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా నల్లగా లావుగా పొట్టిగా ఒక ఆడ మనిషి భుజాలవరకూ జుట్టు విరబోసుకుని ఉంది. ధర్మయ్య ఆమెను 'ఎవరమ్మా నువ్వు? ఎవరు కావాలి?' అని అడిగాడు. అందుకామె 'నాపేరు బూచి మీకు పని మనిషి కావాలని తెలిసింది. అందుకని వచ్చాను--' అంది. ధర్మయ్య గౌరమ్మను పిలిచి 'పనిమనిషి కావాలంటున్నావుగా ఇదిగో ఈమె చేస్తానంటోంది. కావాలంటే చేయించుకో' అన్నాడు. గౌరమ్మకు ఎందుకో బూచిని చూడగానే భయం వేసింది. భర్తకు కోపం వస్తున్నా లెక్కచేయకుండా బూచిని పంపించి వేసింది.

ఆ రోజు రాత్రి పడుకోబోతూ ధర్మయ్య గౌరమ్మతో 'పనిమనిషి కావాలి అంటూ ఇంటికి వెతుక్కుంటూ వచ్చిన మనిషిని పంపించేశావేం?' అని అడిగాడు. అందుకు గౌరమ్మ 'ఏమోనండీ అది మామూలు ఆడదానిలా లేదు. ఏదయ్యమో భూతమో అనిపించేట్టుగా ఉంది. ఆమె పేరు కూడా అందుకు తగ్గట్టుగానే వుంది' అంది. వెంటనే ఆ గదిలో ఎవరో

టి. విశాలాక్షి

చిన్నగా నవ్వినట్టుగా అనిపించింది. ధర్మయ్య గౌరమ్మ ఉలిక్కిపడి లేచి వెతికి చూశారు. కానీ ఎవరూ కనిపించలేదు. ఆ రోజు నుంచీ ఇద్దరి మనసుల్లోనూ తెలియని భయం పట్టుకుంది.

ఇలా ఉండగా ఒకరోజు ధర్మయ్యకు కొబ్బరి చెట్టు నుండి కాయలు దింపవలసి వచ్చింది. సమయానికి చెట్టు ఎక్కడానికి ఎవరూ దొర కలేదు. ఏం చేద్దామా అనుకుంటుండగా హఠాత్తుగా బూచి అక్కడికి వచ్చింది. కొబ్బరి కాయలు కోయాలన్న సంగతి తానే గ్రహించి చెట్టుపైకి ఎగబాకి, కొబ్బరి గెలకోసి జర్రున కిందికి జారి గెలను ధర్మయ్య ముందు పెట్టి నవ్వుతూ వెళ్ళిపోయింది. ఇది చూసి ధర్మయ్య, గౌరమ్మ కొయ్యబారిపోయారు. ఈ సంఘట నతో వాళ్ళిద్దరి మనసుల్లోనూ బూచి మామూలు ఆడది కాదనే అభిప్రాయం స్థిరపడిపోయింది. అంతే కాకుండా ఎప్పుడు ఏ పని తలపెడితే బూచి ప్రత్యక్షమౌతుందో అనే భయం కూడా ఎక్కువయింది . అప్పటి నుండి బూచిని ఏ విధంగా వదుల్చుకోవాలా అని సతమతం కాసాగారు.

ఒకనాడు గౌరమ్మ బావిలో నీళ్ళు తోడు తూండగా తాడు తెగి బిందె బావిలో పడిపో యింది. గౌరమ్మకు బిందె బావిలో పడిపో యిందే అనే బాధకంటే మళ్ళీ బూచి ఎక్కడ వస్తుందో అనే భయమే ముందు కలిగింది. అనుకున్నట్టుగానే బూచి, బావి వైపు నడిచి వస్తోంది. బూచిని చూడగానే గౌరమ్మకు పై ప్రాణాలు పైనే పోయాయి. బూచి నవ్వుతూ బావిలోకి ఒకసారి తొంగిచూసి, తెగిపోగా మిగిలి ఉన్న తాడును పట్టుకుని జరజరా బావిలోకి జారి నీళ్ళలోకి దూకింది. ఇదే సమ యమనుకొని గౌరమ్మ గబగబా వాకిట్లోకి పరి గెత్తి నులక పేనుతున్న ధర్మయ్యకు సంగతి చెప్పి బావి దగ్గరకు లాక్కుని వచ్చింది. బూచి బిందె తెచ్చి గౌరమ్మ కిచ్చింది. ఇదే అదను కుని ధర్మయ్య ధైర్యాన్ని కూడా దీసుకుని బూచితో 'చూడమ్మా బూచీ ! నువ్వు మాయిం



టికి వస్తుంటే మాకేదో భయంగా వుంటుంది. నువు రాకుండా ఉండాలంటే ఏం చేయాలో చెప్తావా?' అంటూ చేతులు జోడించి విన యంగా అడిగాడు. అందుకు బూచి నవ్వుతూ, 'రాయి ఇస్తే రానుగా' అంది. 'ఏ రాయి?' ధర్మయ్య, గౌరమ్మ ఒక్కసారిగా ఆశ్చర్యంలో అడిగారు. 'అదే, నువ్వు పెట్టెలో దాచిన నల్ల రాయి నాదికాదా?' అంది బూచి.

ధర్మయ్యకు పొలంలో దొరికిన ఆ నల్ల రాయిలో దయ్యం తన శక్తులను కొన్నింటిని దాచిపెట్టింది. ఎక్కడెక్కడో తిరుగుతూ ఒక రోజు దయ్యం ఆ రాయిని పొగొట్టుకుంది. రైతు దాన్ని తీసుకెళ్ళి తన ఇంట్లో పెట్టుకున్న విషయం అది ఎలాగోలా కనుక్కుంది. ఎలా గైనా సరే వారిని ఒప్పించి ఆ నల్లరాయిని తన స్వంతం చేసుకోవాలని ఆ దయ్యం రైతు ఇంటికి వచ్చింది.

బెదిరిస్తే పనికాదని గ్రహించినదై, వారితో మంచిగా ఉంటూ చెప్పిన పని చేస్తూ వారిని మంచి చేసుకుని రాయిని సంపాదించడానికి ఎత్తువేసింది. ఈ క్రమంలో, 'రాయి ఇస్తే రానుగా' అని బూచి అనగానే రైతు దంపతు లకు ప్రాణంలేచి వచ్చినట్లయింది. ధర్మయ్య రాయి తీసుకు రావడానికి ఒక్క పరుగున ఇంట్లోకి వెళ్ళాడు.

ఇంతలో గౌరమ్మకు ఒక మంచి ఆలోచన తట్టింది. అన్ని పనులూ సునాయాసంగా చేయగల బూచిని ఏ ఉపయోగం పొంద కుండా పంపించేయడానికి ఆమె మనసొప్ప లేదు. అందుకని ఆమె బూచితో 'అమ్మా! బూచీ! నీవు చాలా మంచి దానివిలా ఉన్నావు. కాలువ ఎండిపోవడం వల్ల మా వరిమడికి నీళ్ళు చాలడం లేదు. ఎప్పుడూ నీళ్ళు ఎండి పోకుండా ఉండేట్లుగా మాకొక ఊట బావి తవ్వి పెట్టి పుణ్యం కట్టుకోతల్లీ. నీ మేలెప్పుడూ మరిచిపోము' అని వేడుకుంది. అలాగే అని అప్పటికప్పుడే వరిమడికి దగ్గరగా పెద్ద ఊట బావి తవ్వెపెట్టింది బూచి. ధర్మయ్య గౌర మ్మల ఆనందానికి హద్దుల్లేవు. సంతోషంగా బూచికి రాయి ఇచ్చేశారు. బూచి దానిని మురిపెంగా చూసుకుంటూ వెళ్ళిపోయింది.

ఎన్ని నీళ్ళు తోడినా తరగని ఆ బావి నీటితో ధర్మయ్య మాత్రమే కాక పక్క పొలాల వాళ్ళు కూడా పంటలు పండించుకోగలిగారు. ఆనాటి నుండి ఆ ఊళ్ళో వాళ్ళంతా ఆ బావిని బూచి బావి అని పిలువసాగారు.





# ఎదురు తిరిగింది

పూర్వం మిథిలాదేశాన్ని మందభాగ్యుడనే రాజు పాలిస్తుండేవాడు. అతడు ముక్కోపి, గర్వి. యుక్తాయుక్తాలూ సాధ్యాసాధ్యాలూ ఆలోచించకుండా, ఏ క్షణంలో ఏది తోస్తే అది రాజాజ్ఞగా ప్రజల మీద ప్రయోగిస్తూ ఉండేవాడు.

ఒకనాడు మందభాగ్యుడు రాజప్రసాదపు ఉపరిభాగాన చల్లగాలికిపచారుచేస్తూ, క్రింద రాజవీధిని నడుస్తూ వున్న ఆశేష జనాల్నీ, వాళ్ళు ధరించిన వివిధ రకాల దుస్తుల్నీ, పరీక్షగా చూశాడు. వెంటనే అతడికో ఆలోచన తట్టింది. మంత్రిని పిలిపించాడు.

'మంత్రివర్యా!' అన్నాడు రాజు.

'ఏమి సెలవు మహారాజా!' అన్నాడు మంత్రి.

'అటు, రాజవీధివైపు చూడు! ప్రజలు ఎవరికి తోచినవిధంగా వాళ్ళు ప్రవరిస్తున్నట్టు కనబడుతోంది. ఇది సహించరాని విషయం. ధరించే దుస్తుల నుంచి, ప్రతి దాన్నీ అందరు ప్రజలూ ఒకేవిధంగా అనుసరించాలి. ఆహారం, మాట్లాడే భాషా, కొలిచేదైవం, అన్నీ ఒకటిగానే వుండాలి. ఇది మా ఆజ్ఞగా తక్షణం మన రాజ్యమంతటా చాటించు!' అన్నాడు.

వేషభాషల్లో, తిండితిప్పల్లో, భక్తివైరాగ్య విషయాల్లో ప్రజలందరినీ ఒక అచ్చులో తయారైన బొమ్మల్లా చేయడం సాధ్యమయ్యేదికాదని మంత్రి రాజుకు మనవి చేశాడు. 'ఉహూ! రాజాజ్ఞకు తిరుగు లేద'న్నాడు మందభాగ్య మహారాజు.

రెండు మూడు రోజులు గడిచినై, తను మంత్రికి యిచ్చిన ఆజ్ఞలు సరిగా చాటింపు వేయించాడో లేదో, ప్రజలు వాటికి బద్ధులై

కె.వడివేలు

ప్రవర్తిస్తున్నారో లేదో తెలుసుకోవాలనే కోర్కె మందభాగ్య రాజుకు కలిగింది. తన పాలనలోని ప్రతిఒక్కరూ ఆహార విహారాలనుంచి ప్రతి విషయంలో ఒకే పద్ధతినీ, సాంప్రదాయాన్నీ అలవరచుకుని అలా ప్రవర్తించిననాడు, ప్రపంచంలో తన పాలనకు ఒక విశిష్టమైన స్థానం ఆచంద్రార్కంగా ఉండిపోగలదని అతడి కెంతో నమ్మిక కలిగింది.

ఒక నాటి ఉదయం మందభాగ్యుడు ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ కనుపించిన దృశ్యం అతడి మనస్సును కలత పరిచింది.

దాసదాసీలంతా ఒకేరకమైన దుస్తుల్లో వున్నారు. ఎవడు పురుషుడో, ఎవరు స్త్రీయో కూడా తెలుసుకోవడం అసంభవమైపోయింది రాజుకు. అక్కడి నుంచి రాణి వాసానికి వెళ్ళాడు.

అక్కడా ఇదే పరిస్థితి. ఎవరు రాణులో, ఎవరు దాసీలో గుర్తుపట్టడం సాధ్యం కాలేదు. అందరూ ఒకే రకంగా దుస్తులూ, అలంకరణా చేసుకుని ఉన్నారు.

మందభాగ్యుడికి - మతిపోయినట్టయింది. మంత్రి మీద ఎక్కడలేని ఆగ్రహం కలిగింది. సరాసరి దర్బారుహాలుకు వెళ్ళాడు. అక్కడా అదే పరిస్థితి. మంత్రి ఎవరో, సేనానాయకుడెవడో, సేవకుడెవడో తెలుసుకోవడం కష్టమైంది. అందరిదీ ఒకే రకమైన వస్త్రధారణ.

'మంత్రీ!' అని గాండ్రించాడు రాజు.

'మంత్రీ!' అని తాను కూడా తిరిగి గాండ్రించాడు మంత్రి.

'నేనా మంత్రిని? దుర్మార్గుడా!' అన్నాడు రాజు తీవ్రంగా. మంత్రి అదేమాటలను అంతే తీవ్రంగా చిలకలా ఒప్పచెప్పాడు.

మందభాగ్యుడు తన అవివేకానికి సిగ్గుపడ్డాడు. మారుపలక్కుండా తన భవనానికి వెళ్ళిపోయాడు.

మరునాడు, ఎవరికి యిష్టమైన వస్త్రధారణ వారు అనుసరించవచ్చునీ, యిష్టమైన దేవుణ్ణి కొలుచుకోవచ్చునీ రాజాజ్ఞగా చాటింపు జరిగింది.





# శిథిలాలయం -16

(పెద్దపులి మీద పడటంతో, చెంచులు నెగళ్ల దగ్గిర నుంచి పారిపోయారు. ఎంత వెతికినా శిఖిముఖికి, నాగుమల్లి కనిపించలేదు. శిథిలాలయ పూజారి ఆమెను తీసుకుని పారిపోయినట్లు చెంచు దయ్యాలపోతు అతడికి చెప్పాడు. మోకు సాయంతో కొండమీది నుంచి లోయలోకి దిగిపోతున్న పూజారిని, శిఖిముఖి వెంబడించాడు. తరవాత-)

శిఖిముఖి లోయలోకి దిగేసరికి, అతడికి పూజారిగాని, నాగుమల్లిని వీపుకు వేలాడ కట్టుకున్న గండభేరుండంగాని కనిపించ లేదు. వాళ్ళు అతడికన్న కొంచెం ముందుగా లోయలోకి దిగగలిగారు. శిఖిముఖి చుట్టూ కలియ చూసేంతలో అతడికి దూరంగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. వెంటనే అతడు ఆ దిక్కు కేసి వేగంగా పరిగెత్తాడు. చీకట్లో క్రమంగా దూరమైపో తున్న గిట్టల ధ్వని తప్ప అతడికి గుర్రం కనిపించలేదు. శిఖిముఖి నిరుత్సాహ పడిపోతూ, ఇప్పుడేమి చేయటమా అని ఆలోచించేంతలో, మోకు సాయంతో లోయలోకి దిగిన విక్రమకేసరి, అతణ్ణి 'శిఖీ' అని పిలిచాడు.

శిఖిముఖి ఆ పిలుపు వింటూనే అదిరి పడి, వెనక్కు తిరిగాడు. విక్రమకేసరి అతడి భుజం మీద చేయి వేసి చిన్న గొంతుతో, 'ఏం, ఆ దుర్మార్గుడు నీకు అందకుండా పారిపోయాడా?' అని ప్రశ్నించాడు. 'అంద కపోవడమే కాదు, వాడు నా కంటికే కనిపిం చలేదు. దూరాన గుర్రం పరిగెత్తుకుపో యిన శబ్దం మాత్రం విన్నాను,' అన్నాడు శిఖిముఖి.

దాసరి సుబ్రహ్మణ్యం

‘వాడుగానీ, ఆ భేరుండంగానీ నాగు మల్లిని గుర్రంమీద వేసుకుని త్వరత్వరగా ఈ ప్రదేశం వదిలి పారిపోయి ఉంటారు. అలా జరిగివుంటే మాత్రం ఆ పూజారిగాడికి ఇక్కడ సహాయపడేందుకు మరికొందరు మనుషులు ఉండి ఉండాలి. లేకపోతే గుర్రం ఎక్కణ్ణుంచి వస్తుంది!’ అన్నాడు విక్రమకేసరి.

‘అంతే అయివుండాలి. మనం మాటలతో కాలయాపన చేయడం ఎందుకు. ఈ చుట్టుపక్కల వాళ్ళకోసం వెతుకుదాం. మనవాళ్ళందరూ కొండ దిగి వస్తున్నారు గదా?’ అన్నాడు శిఖిముఖి.

‘వస్తున్నారు. వాళ్ళు ఇక్కడికి చేరేందుకు కొంత ఆలస్యం అవుతుంది. నువ్వు గుర్రం పరిగెత్తిపోయిన ధ్వని ఏ దిక్కుగా విన్నావు.’ అని అడిగాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఉన్న చోటు నుంచి కదిలి, అక్కడికి దాపుల ఉన్న చెట్లకేసి చేయి చూపాడు. ఇద్దరూ అటు కేసి నిశ్శబ్దంగా బయలు దేరారు. ఆ ప్రదేశం లోయకు కొంచెం ఎగువగా ఉన్నది. అంత చీకటిలోనూ చెట్ల మధ్య నుంచి సన్నని కాలిబాట ఒకటి వాళ్ల కంట బడింది. ఆ బాట వెంట వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి బాటకు పక్కగా ఉన్న పొదల చాటు నుంచి చిన్న వెలుగు వాళ్ళకు కనిపించింది.

శిఖిముఖి, విక్రమకేసరికి ఆ వెలుగు చూపి, ‘ఎవరో ఆ పొదల వెనక నెగడు



వేసుకుని కూర్చున్నట్లున్నది. అరణ్య మృగాల భయం కొద్దీ, ఈ ప్రాంతాల దొంగలైనా దొరలైనా రాత్రివేళల్లో నిప్పు ముందు కాలక్షేపం చేయవలసిందే. వీళ్ళెవరో తెలుసుకుందాం,’ అంటూ పొదల చాటునే నక్కుతూ ముందుకు కదిలాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ ఆ నెగడు ఉన్న చోటుకు దాపులనున్న పొదల వెనక్కు పోయేసరికి, వాళ్ళకు నెగడు ముందు ఇద్దరు మనుషులు కనిపించారు. వాళ్ల దుస్తుల తీరూ అదీ చూస్తుంటే, వాళ్ళు అడవి దొంగల్లా ఉన్నారు. వాళ్లు లోకం మాటే మరిచి కాళ్ళముందు పరుచుకున్న వస్త్రం మీద కుప్పగా పోసి ఉన్న వెండి కాసుల్ని లెక్కిస్తున్నారు.




శిఖిముఖి, విక్రమకేసరిని, ఆ దొంగల వెనక ఉన్న పొదల చాటుకు వెళ్ళమని చెప్పి, తాను పొదల చాటునుంచి కత్తి దూసి వాళ్ల ముందుకు పోతూ, 'ఉన్న చోటు నుంచి కదలకండి, జాగ్రత్త!' అని గట్టిగా హెచ్చరించాడు.

దొంగలిద్దరూ అదిరిపడి, కత్తులు దూయబోయిన వాళ్ళల్లా శిఖిముఖిని చూస్తూనే ఓ క్షణకాలం పాటు తటపటా యించారు. ఆ అదునులో విక్రమకేసరి పొదల చాటునుంచి వాళ్ళ వెనగ్గా వచ్చి నిలబడి, కత్తిని వాళ్ల కంఠాల మీద ఆడిస్తూ, 'జాగ్రత్త, కదలకండి!' అంటూ హుంకరించాడు. దొంగలు ఆ హెచ్చరికతో కుక్కిన పేనుల్లా అయిపోయారు. శిఖి ముఖి వాళ్లను సమీపించి, ఒరల నుంచి కత్తులు లాగి దూరంగా విసిరివేస్తూ, 'శిథి లాలయపూజారి ఎక్కడ?' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే దొంగల్లో ఒకడు అమాయకంగా ముఖం పెట్టి, 'శిథిలా లయ పూజారా? ఆ పేరే వినలేదే!' అన్నాడు. 'ఆ పేరు వినటమే గాదు, ఆ దుర్మార్గుడి నుంచే ఈ వెండి కాసులన్నీ సంపాయించారు. మోసం చెయ్యాలని చూడకండి.' అని విక్రమకేసరితో, 'కేసరీ, వీళ్లచేత నిజం చెప్పించటం ఏమంత కష్టం కాదు. పారిపోవాలని ప్రయత్నించిన వాణ్ణి నిర్దాక్షిణ్యంగా కత్తితో నరుకు,' అని చెప్పి, దొంగల్లో ఒకడి తలకు ఉన్న వస్త్రాన్ని లాగి, దానితో వాడి చేతులను వెనక్కు విరిచి కట్టాడు శిఖిముఖి.

'ఇప్పుడు నిజం చెప్పబోతున్నారు. తెలిసిందా?' అని శిఖిముఖి నెగడు నుంచి కాలే కట్టె ఒకటి తీసుకుని, ఒక దొంగ వాడి కేసి అడుగు వేశాడు. రానున్న ప్రమాదాన్ని గుర్తించగానే దొంగలబోమంటూ, 'అయ్యా, నన్ను కాల్చి చంపకండి. ఆ పూజారి ఎక్క డున్నాడో తెలీదు. అతడికి ఒక గుర్రం అమ్మాం. ఆ డబ్బు పంచుకుంటున్నాం,' అన్నాడు.

'నీకు తెలిసింది ఇంతే నన్నమాట. సరే, నీ స్నేహితుడికి ఇంకొంత, తెలిసి ఉంటుంది.' అంటూ శిఖిముఖి కాలే కట్టెను రెండవ దొంగ మీదికి గురి చేశాడు.



దొంగ గడగడ వణికిపోతూ, 'అయ్యా లారా, మమ్మల్ని హింసించకండి. ఇప్పుడు మాకు తెలిసిందంతా చెప్పేస్తాం. ఆ పూజారీ అతడి నౌకరూ మాట్లాడుకునేదాన్ని బట్టి, వాళ్లు రాత్రికి రాత్రే బయలుదేరి బ్రహ్మ పుత్రానదీ ప్రాంతాలకు వెళ్ళిపోతున్నట్టు తెలిసింది. సత్యం చెబుతున్నాను. ఆ పైన కొండదేవతే సాక్షి,' అన్నాడు.

'శిఖీ, ఈ వెధవలు బ్రహ్మపుత్రానది ఈ పక్కన ఎక్కడో ఉన్నదనుకున్నారులా ఉంది. ఒళ్లు కాలితే తప్ప నిజం చెప్పరు,' అంటూ విక్రమకేసరి శిఖిముఖి చేతిలో ఉన్న నిప్పు కట్టెను కూడా లాక్కుని, ఇద్దరు దొంగల తలలమీదా ఆనించబోయాడు.

'మా కింతకన్నా ఏం తెలియదు. రక్షించండి,' అంటూ దొంగలు గగ్గోలు ప్రారంభించారు. శిఖిముఖి, విక్రమకేసరిని వారించి, 'వీళ్ళు నిజం చెబుతున్నట్టే ఉన్నది. పాపం, నాలుగు రాళ్ళకోసం గుర్రాన్ని ఆ పూజారికి అమ్మటం నేరం కింద జమకట్టలేం కదా,' అని దొంగలతో, 'సరే, ఇక మీ చావేదో మీరు చావండి. ఒక వేళ మీ కెప్పుడైనా ఆ పూజారి గాని, సవరవాడు.. వాడి పేరు భేరుండం గాని కనిపించితే, ఆ సంగతి మా కుంబారమిట్ట పల్లెలో చెప్పాలి. అలా చేయక పోయారో మీ చర్మం వలిచి తీరుతాను,' అన్నాడు.

'అయ్యో, మీరు ప్రాణదాతలు. మాటి స్తున్నాం. ఆ పూజారి కనిపిస్తే, అగమేఘాల

ఈసారి ఆ రెండవ దొంగ ఒక చావు కేక పెట్టి, 'అయ్యా, నన్ను కాల్చకు. అంతా నిజం చెబుతాను. ఆ పూజారి వెంట దుక్క లాంటి సవరవాడొకడున్నాడు. వాడు చాపలో చుట్టి తెచ్చిన ఒక మనిషిని పూజారి గుర్రం మీదవేసుకుని అరణ్యంలోకి దౌడు తీశాడు. ఇంతే మాకు తెలిసింది,' అన్నాడు.

'కాదు, మీకింకా చాలా తెలుసు, కేసరీ, నువ్వొ ఒక నిప్పు కట్టె అందుకో,' అన్నాడు శిఖిముఖి. విక్రమకేసరి నెగడులో నుంచి బాగా మండుతున్న కట్టె నొకదాన్ని తీసుకుని మొదటి దొంగను సమీపిస్తూ 'వీపు కాల్చడం కంటే తల కాలిస్తే వీళ్లకు మరి కాస్త సుఖంగా ఉంటుంది.' అని కట్టెను మొదటి దొంగ తలమీద పెట్టబోయాడు.

మీద వచ్చి, మీ పల్లెలో -- ఆ సంగతి చెపుతాం,' అన్నాడు దొంగల్లో ఒకడు.

శిఖిముఖి అంగీకార సూచకంగా తలా డించి, విక్రమకేసరిని వెంట బెట్టుకుని చెట్లల్లోకి కొంత దూరం పోయి ఆగి, కేసరీ, 'ఈ దొంగలు మనతో చెప్పకుండా దాచిన ముఖ్య రహస్యం ఒకటున్నదని నా కను మానం కలుగుతున్నది. పూజారికి గుర్రాన్ని అమ్మిన మాట నిజం. కాని, వాడెక్కడ ఉన్నదీ తమకు తెలియదనటం పూర్తి అబద్ధం. ప్రాణభయం పెట్టినా మనను వాళ్ళు అబద్ధాలతో పక్కదార్లు తొక్కించ వచ్చు. అందుకని, నేను వాళ్లను వెంబ డించి, ఎటుపోయేదీ తెలుసుకోదలిచాను. నువ్వు, ఈ ప్రాంతాల్లోనే ఉండి, మనవాళ్లు రాగానే, వాళ్లను నాలుగు దిక్కులకూ పూజారిని వెతికేందుకు పంపి, ఈ సమీపం లోనే నాకోసం కాచుకుని ఉండు.' అన్నాడు.

విక్రమకేసరి 'సరే' నన్నాడు. ఆ వెంటనే శిఖిముఖి దొంగలున్న చోటుకు పోయాడు. అతడు పొదలచాటు నుంచి వాళ్లేమి చూస్తు న్నదీ చూసేంతలో దొంగలు డబ్బును రెండు చిన్న మూటలుగా కట్టి నడుముకు వేలాడ వేసుకుని, పొదల్లో వెతికి, పోయిన కత్తులను సంపాయించి, నవ్వుకుంటూ అరణ్యంలోకి ఉన్న కాలిబాట వెంట బయలు దేరారు. శిఖిముఖి నిశ్శబ్దంగా వాళ్లను అనుసరించాడు. విక్రమకేసరి చీకట్లో అటూ ఇటూ పచార్లు చేస్తూ తన



అనుచరుల రాకకోసం ఎదురు చూడసా గాడు. ఓ పావు గంట గడిచింది. హఠాత్తుగా అతడికి లోయ దిగువ ప్రాంతం నుంచి కుక్క అరవటం వినబడింది. ఆ అరుపు శిఖిముఖి వేటకుక్క ఎర్రగండుదని అతడు గ్రహించాడు. దాని అర్థం కుంభారమిట్ట నుంచి శివాలుడు గాని లేక శిఖిముఖి బంధువుల్లో మరెవరైనా గాని అటు వస్తు న్నారన్నమాట. అతడు చప్పున కదిలి కుక్క అరుపు వినబడిన వైపుకు నడవసాగాడు. కొద్దిసేపట్లోనే అతడికి లోయపైకి ఎక్కి వస్తున్న శివాలుడూ, గండుపోతూ, వాళ్ల వెంట నలుగురైదుగురు శబర సవరవాళ్లూ కనిపించారు. ఒక శబరుడు ఎర్రగండు మెడనున్న తాడు పట్టుకుని ఉన్నాడు.

కుక్క తాడును గుంజుతూ ముందుకు పరిగెత్తాలని పెనుగులాడుతున్నది.

శివాలుడు, విక్రమకేసరిని చూస్తూనే, 'కేసరీ, క్షేమంగా ఉన్నావా? శిఖి ఎక్కడ? నాగుమల్లిని ఆ దుర్మార్గుడైన పూజారి ఎత్తుకుపోయిన మాట నిజమా?' అని ప్రశ్నించాడు. విక్రమకేసరి జవాబు చెప్పబోయేంతలో, సవరగండుపోతు పెద్దగా గొంతెత్తి, 'ఆ పూజారి నీచుణ్ణి ప్రాణాలతో చర్మం ఒలిపిస్తాను. వాడెక్కడ?' అని ప్రశ్నించాడు.

శివాలుడు అతడి భుజం పట్టుకుని, 'తొందరపడకు గండుపోతూ, ముందు సంగతి సందర్భాలు తెలుసుకోనీయ్,' అన్నాడు శాంతపరుస్తూ.

విక్రమకేసరి తాము అరణ్యంలో ప్రవేశించి, బడేచెంచు నివసించే ఆకాశగుహ చేరటం, అక్కడ జరిగిన గొడవలన్నీ టూకీగా చెప్పి, చివరకు శిఖిముఖి దొంగలను అనుసరించి పోవడం సంగతి తెలియపరిచాడు.

'ఒంటరిగా ఆ అడవి దొంగలను వెంబడించడంలో కొంత ప్రమాదం ఉన్నా, శిఖిముఖి తెలివైన పనే చేశాడు. ఏమైనా ఈ చీకట్లో ఆ పూజారిని పట్టుకోవడం సాధ్యమయ్యే పని కాదు. తెల్లవారింతర్వాత ఈ అరణ్యాలూ, కొండలూ వాడికోసం గాలించవలసి ఉన్నది.' అని, శివాలుడు గండుపోతుతో, 'నువ్వేమీ దిగులు పడకు, నాగుమల్లి ఆ దుర్మార్గుణ్ణించి స్వశక్తితోనే బంధవిముక్తురాలు కాగలదని నా నమ్మకం. అలా జరగకపోయినా, పూజారి మన వలలో చిక్కకుండా పోడు.' అన్నాడు.

శివాలుడు మాట ముగించీ ముగించక ముందే, లోయ పక్కనే ఉన్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి భగభగం మండుతున్న దివిటీ కనిపించింది. ఎవరో దాన్ని గాలిలో ఊపుతున్నారు. శివాలుడూ అతడి వెంట ఉన్న వాళ్లూ అటుకేసి చూసేంతలో, సన్నని ఈల వినిపించింది. (ఇంకా ఉంది)






# అతిథులు

రోజావాళ్లు నాలుగురోజుల క్రితమే కొత్త భవంతిలోకి ఇల్లు మారారు. 'అమ్మా ఆకలేస్తుందే అన్నం పెట్టు,' అంది ఎనిమిదేళ్ల రోజా అమ్మ చెంగు పట్టుకుని లాగుతూ.

'అదేమిటి ఇందాకేగా అన్నం తిన్నావు... మర్చిపోయావా?' అంది తల్లి సుగుణ విస్తుపోతూ.

'అవును కదూ! మరి మళ్లీ ఆకలేస్తోందేం?' అంది రోజా.

'అది ఆకలి కాదే తల్లీ.. తోచకపోవడం.. ఇది కొత్త ఇల్లు కదా? ఇక్కడ నీకింకా ఎవరూ నేస్తాలు కాలేదు. అందుకే ఏమీ తోచక ఆకలేస్తుందనుకుంటున్నావు. పోయి ఆ వరండాలో కూర్చో కాస్త కాలక్షేపమవుతుంది. ఇదిగో ఈ కప్పులో కారప్పూస వేసాను. తిను.' అంటూ సుగుణ మళ్లీ సామాన్లు సర్దుకోవడంలో మునిగిపోయింది. ఎందుకంటే ఆమెకి ఎంత సమయమూ చాలడం లేదు మరి.

రోజా వెళ్లి వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుంది. ఇంతలో ఎక్కడినుంచో మూలుగులా వినిపించేసరికి రోజాకి కాస్త భయం వేసింది. 'అమ్మా ఇలా రావే? ఇక్కడేదో వినిపిస్తోంది,' అంది రోజా.

'మళ్లీ ఏమొచ్చిందే తల్లీ..' అంది సుగుణ వరండాలోకి వచ్చి, 'అదిగో విను, ఎవరో మూలుగుతున్నారు.' అంది రోజా.

సుగుణ నవ్వింది. 'అదా? పావురం తల్లి గుడ్డుపెట్టడం కోసం మూలుగుతోందే... మనుషులకైనా పక్షులకైనా అది తప్పదులే,'

'నిజమేనమ్మా.. అదిగో మన పాత చెప్పుల బల్లకింద కూర్చుంది ఆ పావురం.'

'నాకు లోపల బోలెడు సర్దుకునే పనుంది. నా బంగారు తల్లివి కదూ, ఆ పావురాన్ని కాస్త బెదరగొట్టు. లేకపోతే ఇక్కడే గుడ్డు పెట్టిందంటే మళ్లీ కదలదు. ఈ పావురాలను తరిమెయ్యకపోతే తర్వాత వరండా అంతా

పి.వి. శేషారత్నం



నానా చెత్తా చేస్తాయి. కడుక్కోవడం అదీ కష్టం.' అంటూ రోజా తల్లి లోపలికి వెళ్లిపో యింది.

రోజా పావురాన్ని చూసింది. అది ఎక్కడి నుంచో ముక్కుతో ఏరుకు తెచ్చిన పుడకలతో గడ్డితో మెత్తగా అక్కడ ఇల్లు కట్టుకుంది కాబోలు, దానిమీద కూర్చుని మూలుగు తోంది. రోజాకి ఎంతో జాలి కలిగింది. దానిని అక్కడినుంచి తరిమెయ్యడం ఇష్టంలేకపో యింది. ఎందుకంటే పాపం... అందరూ కూడా అమ్మలాగే అనుకుంటే పావురానికి ఇల్లెక్కడుంది? ఎక్కడ గుడ్లు పెడుతుంది? ఆ పిల్లలు పెద్దయ్యేదాకా ఎక్కడ ఆడుకుం టాయి?

ఇంతలో ఇంకో పావురం వచ్చి అక్కడున్న చుట్టూ తిరిగింది. అది పావురం నాన్నేమో అనుకుంది రోజా. ఆ భవంతి దగ్గర బోలెడు పావురాలు అటూ ఇటూ ఎగురుతూ -- ముక్కుతో పొడుచుకుంటూ ఆడుకుం టూంటే రోజాకి బాగా కాలక్షేమమయింది.

మర్నాడు రోజా నిద్ర లేచి వరండాలోకి వచ్చేసరికి, పావురం తెచ్చుకున్న పుల్లముక్కలు గడ్డితో ఉండే గూడు కనిపించలేదు.

'అమ్మా పావురం గూడేదే?' అని అరిచింది బాధగా. 'అబ్బా నేనే తుడిచేసాను లేవే. లేకపోతే మనుషులకంటే ఈ పక్షుల సేవ ఎక్కువయిపోతుంది. గూడు తీసేస్తే అవే రావడం మానేస్తాయి.' అన్నది సుగుణ విసుగ్గా.

పావురం కనిపించకపోయేసరికి రోజాకి ఆరోజు ఎంతో బాధ కలిగింది. దూరంగా ఎగురుతున్న పావురాల్లో తన అతిథి ఎక్కడుందో?

ఆ రోజు సాయంత్రం పాఠశాల నుంచి ఇంటికి వచ్చాక అలవాటుగా వరండాలోకి వెళ్ళి చెప్పుల బల్ల కింద వెతికింది రోజా

చిత్రం.. మళ్లీ గడ్డిగాదంతో పావురం గూడు తయారు చేసుకుని బుద్ధిగా కూర్చుని ఉంది. రోజాకి ఎంతో సంతోషమనిపించింది.

'అయ్యో, మాయదారి పావురం మళ్లీ వచ్చేసిందా? అరెరే.. గుడ్డుకూడా పెట్టినట్లుంది. ఇక ఇప్పట్లో ఇది ఇక్కడినుంచి కదలదు. ఇలా పిల్లలయ్యేదాక ఆ గుడ్లను పొదుగుతూనే ఉంటుంది,' అంది సుగుణ కాస్త చిరాకుగా.

'అమ్మా పావురాన్ని తరిమెయ్యద్దమ్మా.. ఇక్కడే ఉంటే ఎంచక్కా వాటి పిల్లలని చూడొచ్చు. ఎంత ముద్దొస్తాయో.. నాకు పావురం పాపాయిలు అంటే ఎంతిష్టమో!' అంది రోజా గారంగా. కానీ... తల్లి మాటలను పట్టించుకోలేదు రోజా.

'నేను శుభ్రం చేస్తాను లేమ్మా.. పాపం...

అందరూ మనలాగే అనుకుని వాటిని తరి మేస్తే అవి ఎలా బ్రతుకుతాయి? ఇవాళ మా టీచరుగారు చెప్పారు. పక్షులు కూడా పర్యా వరణంలో భాగస్వాములే కనుక వాటిని పరి రక్షించుకోవడం కూడా మన బాధ్యతేనని..'

'ఇది మరీ బావుందే తల్లీ.. చెట్లమీద ఉండాల్సిన పక్షులు ఇళ్లల్లో గూళ్లు పెడితే ఎలా?' అంది సుగుణ.

'అందుకు మనమే కదా అమ్మా కారణం. ఇదివరకు బోలెడు చెట్లుండేవి కనుక అక్కడ ఎంచక్కా గూళ్లు కట్టుకుని పిల్లల్ని పెట్టుకుని పెంచుకునేవి. మరి కలపకోసమని.. ఇళ్లు కట్టుకోవడం కోసమని మనం చెట్లను కొట్టేస్తు న్నామట కదా? మరి పక్షులకు ఉండటానికి చోటు లేక ఇలా మన వరండాలలో గుడ్లు పెట్టుకుంటున్నాయి. మనం చెట్లు కొట్టేయకపోతే అవి మన ఇళ్ళకి రావుగా. అందుకే అవి ఇక్కడ ఉంటే తప్పేముంది? పక్షులంటే మనకి అతిథులమ్మా! ఇదంతా మా టీచరు గారే చెప్పారు.' అంది రోజా.

'బావుంది తల్లీ! చదివేస్తే ఉన్న మతి పోయిందనీ..' అంటూ ఏదో అనబోయింది సుగుణ. కాని వెనుకనుంచి అప్పుడే కార్యా లయం నుంచి వచ్చిన రోజా తండ్రి సుబ్బా రావు అందుకున్నారు. 'నా చిట్టి తల్లీ నువ్వు చెప్పిందంతా నిజమేనమ్మా.. మనం వాటి ఇళ్లు అంటే చెట్లను కొట్టేసాం కనుక మన ఇళ్లకు అతిథుల్లా వస్తున్నాయి.. మళ్లీ మనం కంకణం కట్టుకుని చెట్లు పెంచితే మన అతిథులు మళ్లీ పచ్చని పర్యావరణంలోకి అంటే వాటి ఇళ్లకు అవి చేరుకుంటాయి.'

'తండ్రీకూతురూ ఒకటైపోతే ఇంక నేను చేసేదేముంది?' అంది సుగుణ నవ్వుతూ.

'ఏమీ చెయ్యకు.. మన రోజా అతిథు లను నాలుగురోజులు ఇక్కడే ఉండనీ.. రెక్కలొస్తే అవే ఎగిరిపోతాయిలే.' అన్నారు సుబ్బారావు.

మరింక ఆ రోజునుంచి రోజాకి తోచకపో వడమంటూ లేదు. ఎందుకంటే పావురం గుడ్లనుంచి బయటికొచ్చిన పావురం పాపా యిలు రోజా కువకువలాడుతూ రెక్కలు వచ్చేదాకా అక్కడే గెంతుతూ.. కొంచెం కొంచెం ఎగరడం నేర్చుకుంటూ రోజాకి అతిథులుగా సందడి చేస్తూనే ఉన్నాయి మరి!!!





# దేవుడితో... చదరంగం

పూర్వం ఒకానొకప్పుడు ఒక స్వాముల వారు ఉండేవారు. ఆయన గొప్ప పండితుడని పేరు పొందాడు. ఆయనకు దేశమంతటా శిష్యగణం ఉండేది. వారంతా స్వామి దర్శనం కోసం తహతహలాడే వారు.

స్వామి ఒక్క ఆరునెలలు మాత్రమే తన ఆశ్రమంలో ఉండి శిష్యులకు వేదవేదాంగ రహస్యాలు అన్నీ విప్పి చెబుతూ, తక్కిన ఆరు నెలలూ దేశాటన చేసేవారు. సంచారం సాగించే సమయంలో, శిష్యులు భక్తితో సమర్పించే తృణమో పణమో స్వీకరించి, లభించిన దానితో తృప్తి పడేవారు.

ఇలా స్వామివారు దేశాటన చేసుకొంటూ, ఒకనాడు పల్లె ప్రాంతంలో ఉండే శిష్యుల వద్దకు వెళ్లడం తటస్థించింది. స్వామి అల్లంత దూరాన ఉండగానే, ఈ వార్త వాడవాడలా అల్లుకున్నది. శిష్యబృందం అంతా చేరి, మంగళతూర్యారావాలతో స్వామికి ఎదురేగి గ్రామంలోకి తీసుకువచ్చారు.

విష్ణు ఆలయపు ఆవరణలో ఉండే ఒక మండపంలో వారికి బస ఏర్పాటు చేశారు.

'గ్రామంలో స్వామి అడుగు పెట్టింది మొదలుకొని, ఇక ఆ సందడి చెప్పతరమే కాదన్నమాట! భజనలతో, కాలక్షేపాలతో, పురాణ పఠనాలతో కాలం సద్వినియోగం ఐనందుకు గ్రామస్థులు ఆనందించి ధన్యులమయ్యామని అనుకున్నారు.

పి. రంగనాయకమ్మ

ఆ గ్రామస్థులను తరింపజేసిన వెంటనే స్వామి మరి ఒక గ్రామానికి మకాం మార్చడానికి ప్రయత్నించేస్తున్నారు.

శిష్యుల నందరినీ సంతోషపెట్టాలి కదా మరి? ఇంకొక్క గంటసేపటిలో బయలుదేరతారనగా, స్వామి తన బసలో ఏదో ఆలోచిస్తూ అటు ఇటు పచార్లు చేయసాగారు.

అలా పచార్లు చేస్తున్న స్వామికి ఎదుట అడవిలో ఒక మనిషి చేసే వింత చేష్టలు ఆశ్చర్యం కలిగించినై.

'వీడెవడురా అబ్బా, ఒకవేళ పిచ్చివాడు కాదు కదా!' అనుకున్నాడు స్వామి తన మనస్సులో. పరకాయించి చూస్తే, ఆ దుస్తులూ వాడూ, ఒక సంపన్న గృహస్థులాగా కనిపించాడు.

ఈ చిత్రమేమిటో కనుక్కోవాలనే నిశ్చయంతో, స్వామి పాదచారిగానే బయలుదేరి అతని దగ్గరకు వెళ్లాడు.

స్వామి అలా రావటం ఏమీ గమనించలేనట్టుగా వాడు తనలో తనే మాటాడుకుంటూ, కాళ్లూ చేతులూ వింతగా ఊపుతూ ఉన్నాడు.

'అబ్బాయీ! ఏమిటిదంతా? నువ్వు ఇక్కడ ఎవరితో మాటాడేది?' అని స్వామి ప్రశ్నించాడు. 'మాట కాదు అట. ఆటాడుతున్నాను. నేనెవరితో ఆడుతున్నానో బహుశా వారు మీకు కనబడరేమో!' అని



బదులు చెప్పాడు ఆ కొత్త మనిషి. విస్మయం పొందాడు స్వామి. వీడు పిచ్చివాడా! అని మళ్లీ ఒకసారి సంశయం కలిగింది ఆయనకు.

'అబ్బాయ్! నువ్వాడే ఆట ఏమిటి? నీతో ఆడే ఆ అవతలివారెవరు? నాకు చెప్పవచ్చా?' అని అడిగాడు స్వామి.

'అదే ఉన్న రహస్యమల్లా! ఐనా లోక కల్యాణం కోసం అవతరించిన మహానుభావులు మీరు. మీకు వెల్లడి చేయడానికి అభ్యంతరమేముంది. నేను ఆడే ఆట చదరంగం. నాతో ఆడే అవతలివాడూ కేవలమూ ఆ దేవుడే!' అని చెప్పాడు తొణుకూ బెణుకూ లేకుండా ఆ వింత మనిషి.



స్వామికి పొట్ట చెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. వీడెవడో నిజంగా పిచ్చివాడే. కానీ ఆ పిచ్చిలోనూ ఒక తెలివీ, పద్ధతీ కనబడుతున్నది. అనుకున్నాడు.

అప్పుడు స్వామి 'ఐతే గెలుపెవరిది?' అని మళ్లీ అడిగాడు.

'ఉండండి, ఉండండి! ఇంకా ఆట పూర్తి కాలేదు.' అని అతను చెట్టుమీదికి చూస్తూ, 'మీరన్న రాజూ ఆటకట్టు అన్న మాట విన్నాను దేవా! ఇవాళ గెలుపు మీదే' అంటూ, జేబులో చెయ్యి పెట్టాడు.

ఈ చర్య స్వామికి మరింత వింత కొలి పింది. 'మరి గెలిచినవాళ్లకు ఓడినవాళ్లు ఏమైనా ఇచ్చుకోవాలా?' అని ప్రశ్న వేశాడు.

'లేకేమి స్వామీ! ఆటకు రెండు మొహ రీలు చొప్పున పందెం' అని చెప్పాడు, ఆ కొత్తమనిషి.

ఐతే.. ఇప్పుడు నువు ఓడిపోయావు కదా మరి, దేవుడికి రెండు మొహరీలూ చెల్లించలేదేం.? అని తమాషాకు అడి గాడు స్వామి మనసులో నవ్వుకుంటూ.

అడగటమే తడవుగా అతను గభీమని జేబులోనించి రెండు మొహరీలు తీసి, 'దేవుడు ఎప్పుడూ తన పందెం డబ్బు నా దగ్గిరనుండి స్వయంగా తీసుకోరు. ఆ సమయానికి ఏ భాగవతోత్తముని రూపం లోనో వచ్చి ప్రత్యక్షమవుతారు.

వారికి ఇస్తే దేవుడికి చెందుతుంది ఆ ధనం. ఇవాళ అదృష్టవశాన మీరు వచ్చారు. కనుక, దయ చేసి ఈ మొహరీలు రెండూ, తమరు పుచ్చుకున్నారంటే ఆ దేవుడికి అందేస్తుంది,' అంటూ, ధగధగ మెరిసే రెండు నాణాలు స్వామి చేతిలో పెట్టాడు.

ఆ నిమిషాన ఏం చేద్దామన్నా స్వామికి పాలుపోయింది కాదు. వెంటనే బసకు మరిలి పోయి, పిచ్చివాళ్లలో కూడా ఎంతటి గొప్ప భక్తులున్నారో తన శిష్యబృందానికి అయన తెలియజెప్పాడు.

రెండు నెలల తర్వాత--

స్వామివారు కొంతవరకు దేశసంచారం చేసి, శిష్యకోటిని తరింపజేస్తూ, వారిచ్చిన కట్నాలూ కానుకలూ మూటగట్టుకుని, ఇంటి ముఖం పట్టారు. తిరుగు ప్రయా ణంలో వారు మళ్ళీ ఇదే గ్రామం రావడం

తటస్థించింది. ఊరిలో దిగుతూనే..., స్వామికి వెనుకటి వింతమనిషి సంగతి గుర్తుకు వచ్చింది.

మళ్లీ అడవిలో ఆ ప్రాంతంలో చూస్తే, ఆ పిచ్చివాడు ఎప్పటిచోటనే కనిపించాడు. వెంటనే కుతూహలం కొద్దీ స్వామి అతనివద్దకు వెళ్లి,

'అబ్బాయ్! ఇవాళ ఎవరిది గెలుపు?' అని వినోదంగా ప్రశ్న వేశారు.

ఆడుతూ ఆడుతూ ఉన్న అతను అట్టె ఒకమారు మునుపటిలాగానే చెట్టుపైకి చూశాడు. 'రాజూ--ఆటకట్టు!' అని పెద్దగా అరిచి, పకపకా నవ్వాడు.

'ఏమిటోయ్ ఖులాసా? చూడగా ఇవాళ నువ్వే గెలిచినట్లుందే!' అన్నాడు స్వామి.

'గెలిచాను స్వామీ, గెలిచాను మీ చలవవల్ల. అదృష్టం ఏమిటోకాని ఈ సారి పందెం కూడూ ఘనమయిందే! వంద మొహరీలు!' అని చెప్పి, మళ్లీ పకపక నవ్వాడు. ఐతే-'దేవుడు ఆ డబ్బు నీకు ఏవిధంగా చెల్లిస్తాడు?' అని అడిగాడు స్వామి, పొంగిపొరలే నవ్వు ఆపుకుంటూ.

'దేవుడు ఎన్నడూ నాకు స్వయంగా డబ్బు చెల్లించాడు. ఆ సమయానికి ఏ పరమ భాగవతోత్తముని రూపంలోనో సాక్షాత్కరించి, నాకు అందజేస్తాడు. ఇవాళ అదృష్టవశాన తమరు దర్శనమిచ్చారు సమయానికి' అన్నాడు వాడు.

ఈ మాట అర్థం గాక తెల్లబోయి చూస్తున్నాడు స్వామి. 'తమరు నాకు చెల్లించి వేస్తే దేవుడి బాకీ తీరిపోతుంది!' అంటూ ఆ మోసగాడు పక్క పొదలో ఉంచిన దుడ్డుకర్ర బయటకి తీశాడు.

స్వామి బిత్తరపోతూ, సంచారంలో శిష్యకోటి తనకు సమర్పించిన సమస్తమూ వాడికి సమర్పించుకొని, ఉత్త చేతులతో ఇంటికి దారితీశాడు!





# మునసబు తీర్పు

తామరాడ గ్రామంలో తమ్మిరాజు అనే కోమటి ఒక సంతరోజున రాత్రి ఎనిమిది గంటల వేళప్పుడు చీడీమీద చతికిలబడి లబో లబో మని గుండె బాదుకోటం మొదలెట్టేడు.

వీధిని పోతున్న కరణం గవర్రాజు 'ఏం తమ్మిరాజూ, ఎందుకు అలా ఏడుస్తున్నావు?' అని అడిగేడు.

తమ్మిరాజు, 'ఇంతకంటే ఏం కావాలి బాబయ్యా ? వారమంతా అమ్మగా వచ్చిన చిల్లర పోగుచేసి, నూరు రూపాయలకు సరిపడా సంతకు పట్టుకెళ్ళి, రూపాయి చిల్లరకు కానీ చొప్పున మారకం పుచ్చుకుని అంతా రూపాయలుగా మార్చేశాను. కరుకుల్లాంటి నూరు రూపాయిలూ సంచీలోవేసి మూతి బిగించాను. మారకం డబ్బుల క్రింద వచ్చిన రూపాయి తొమ్మిదణాలూ పెట్టి దొండకాయలు, ఉర్లగడ్డ వెల్లుల్లి, పచ్చిమిరప కొని తక్కిన సంచీలలో వేసికట్టుకున్నాను.

ఇటువైపు వచ్చే రెండెడ్ల ఖాళీబండి కనపడగా బండి వాడితో మంచి మాటాడి సంచులతో బండెక్కేను. బండి మీద నాకు కునికిపాట్లొచ్చాయి. ఇల్లు చేరుకుని బండి దిగి ఒక్కొక్క సంచీనే అరుగుమీద చేరవేశాను.

కూరలసంచీలు నాలుగూ ఉన్నాయి కాని రూపాయిల సంచి మాత్రం కనపడలేదు. దిక్కుమాలిన బండి, దానిలో కూచోటానికి వేసిన తడికకు అన్నీ బొర్రిలే' అనిచెప్పి, మళ్ళీ ఒక మాటు 'గొల్లు' మన్నాడు.

బి. రుక్మిణి

గవర్రాజు సానుభూతి కనపరుస్తూ 'ఏ బొర్రిలోంచో మూట జారి రోడ్డుమీద పడిపోయి ఉంటుంది. ఒక పని చెయ్యి. నా రూపాయల సంచి పోయింది. దాన్ని తెచ్చిన వాళ్ళకి పది రూపాయిలు బహుమానం యిస్తాను అని వెట్టివాడిచేత చాటింపు వేయించు. ఆపైన అదృష్టం ఎలాగుంటుందో చూద్దాం' అన్నాడు.

తమ్మిరాజు, 'పదికాదు, పాతిక ఇచ్చుకుంటాను! యేభై ఇచ్చుకోమన్నా ఇచ్చుకుంటాను!! నా సంచి నాకు దొరికితే అంతేచాలు, అన్నాడు.

'పదిరూపాయలు ఇస్తానందూ, చాలు. ఆపైన నీకెంత తోస్తే అంత యివ్వవచ్చు' అన్నాడు కరణం.

మర్నాడు తెల్లవారటంతోనే ఏయే ఊళ్ళ నుంచి ఐతే ఆ సంతకు జనం వస్తారో ఆ ఊళ్ళన్నింటిలోను తమ్మిరాజు తన రూపాయల సంచిని గురించి -- టముకు వేయించాడు.

సరిపల్లె గ్రామంలో అరుగుమీద కూచుని జంధ్యాలు వడుక్కుంటున్న పాపయ్య శాస్త్రి ఆ చాటింపు వినటంతోనే లోపలకు వెళ్ళి భార్యతో, 'ఏమేవ్, నిన్న నాకు దొరికిన రూపాయిల సంచి తామరాడ కోమటిదట. పట్టుకెళ్ళి ఇస్తే పదిరూపాయిలు బహుమానం ఇస్తాట్ట కూడాను. ఏది ఆ సంచి? ఇలాతే ఇప్పుడే అప్పుజెప్పి వస్తాను' అన్నాడు.



శాస్త్రిగారి భార్య జానమ్మ, 'ఏమిటి? చేతికి చిక్కిన మూటను చేతులారా వప్పగించి వస్తారా? ఎక్కడైనా విన్నామా, ఇలాంటి విడ్డూరం ? అంది. 'ఊరికే ఇస్తాముటే? పదిరూపాయలు బహుమతి వస్తుంది అని చెప్పానుగా?' అన్నాడు శాస్త్రి.

'మీతెలివి తేగలు తిన్నట్లుగానే ఉంది! గప్ చిప్‌గా ఊరుకుంటే సంచెడు రూపాయిలు మనవే కదుటండీ! ముష్టి పది రూపాయలెక్కువా సంచెడు రూపాయిలెక్కువా?' అంది జానమ్మ.

'సొమ్ము ఎవరిదో తెలిశాక మనదగ్గర ఉంచుకోటం దొంగతనం అవుతుంది. ఐనా, ఒకళ్ళ డబ్బు మనకెందుకు పోనిద్దూ.



తే.. ఇలా తే, ఆ సంచీ. ఇచ్చి చక్కావస్తా'
అన్నాడు శాస్త్రి.

'ఇదిగో పట్టుకెళ్ళండి' అంటూ జానమ్మ సంచి తెచ్చి, శాస్త్రి ముందు గిరవాటేసింది.

శాస్త్రి ఆ సంచీ పుచ్చుకుని తామరాడ చేరుకున్నాడు.

'షావుకారుగారూ గోకవరంలో గోపి నాథరావుగారింట పెళ్ళికి తొందరగా వెడుతూవుంటే రోడ్డుమీద యీ సంచి నా కాలికి తగిలి, నేను బోర్లాపడ్డంత పనైంది.

'ఏమిటి చెప్మా?' అని తడిమి చూస్తే లోపల రూపాయిలలాగా గట్టిగా తగిలాయి. ఇవాళ ప్రొద్దున్నే మీ చాటింపు విన్నాను. మీ సొమ్ము మీకు వప్పచెప్పి బహుమానం పుచ్చుకుందామని వచ్చాను'
అన్నాడు.

తమ్మిరాజు-తన రూపాయల సంచీ కంటబడటంతోనె బ్రహ్మానందభరితుడయాడు. సంచీ మూతి విప్పి, రూపాయలన్నీ ఒక మాటు లెక్క చూసుకున్నాడు. నూరు రూపాయిలూ చెక్కు చెదరకుండా ఉన్నాయి.

ఇంక బ్రాహ్మడికి బహుమతీ క్రింద వాటిల్లోంచి పదిరూపాయలు తీసి ఇవ్వటమే తరవాయి. కాని తీరా సంచీ చేతికి చిక్కగానే ఆ పదిరూపాయిలూ ఇవ్వటానికి మనసు వప్పిందికాదు!

'శాస్త్రులు గారూ, ఈ సంచీలో నూట పదిరూపాయలుండాలి. లెక్కచూస్తే నూరే ఉన్నాయి ! మీ బహుమానం పదీ మీరు ముందే తీసుకున్నట్టున్నారే!' అన్నాడు.

పాపయ్య శాస్త్రి ఆ పలుకులు విని నిర్ఘాంతపోయాడు. తమ్మిరాజు ఆయనను బుకాయించేసరికి మారుమాట చెప్పలేక శాస్త్రి తిరుగుదారి బట్టేడు.

వెళుతూవుండగా దారిలో కరణం గవర్రాజు ఎదురై, శాస్త్రిని పలకరించాడు. జరిగిన సంగతంతా శాస్త్రి అయనకు చెప్పగా విని గవర్రాజు షావుకారు చేసిన దగాకు ఉగ్రుడైపోయాడు.

'మునసబు దగ్గరఫిర్యాదు చెయ్యండి. మీ బహుమతీ మీకు నించున్నపాటున

ఇప్పించేస్తాడు. ఇంత దారుణమా మరిన్నీ' అని సలహా చెప్పాడు.

అలానే శాస్త్రి వెళ్ళి మునసబుతో ఫిర్యాదు చేశాడు. తామరాడ మునసబు చాలా తెలివైనవాడు. సంగతి సందర్భాలు వెంటనే గ్రహించేశాడు.

'తమ్మిరాజూ, ఈయనకు నీ వాగ్దానం ప్రకారం ఆ పదిరూపాయిలూ ఇచ్చేయ్యి' అన్నాడు. కోమటి ఒప్పుకోలేదు.

నా సంచీలో నూటపది రూపాయిలుండాలి. నూరే ఉన్నాయిప్పుడు. మిగతా పదీ ఈ బ్రాహ్మడు కొట్టేసి, మళ్ళీ బహుమతీ అంటున్నాడు. ఈయన కింక ఒక్క కానీ కూడా ఇవ్వక్కర్లేదు' అని పాతపాటే మొదలెట్టేడు.

అప్పుడు మునసబు 'తమ్మిరాజూ! ఈ బ్రాహ్మడు మూతికూడా విప్పకుండా తెచ్చిన సంచీలో నూరు రూపాయలేకదూ ఉన్నాయన్నావు?' అని అడిగాడు. 'చిత్తం బాబూ ఆయన ఎదుటనే లెక్కబెట్టేను' అన్నాడు షావుకారు.

ఇది విని మునసబు కరణంతో, 'గవ్రరాజుగారూ వీళ్ళిద్దరూ కూడా ప్రామాణికాలు చేసి చెబుతున్నారు గనక ఇద్దరి మాటా నమ్మవలసిందే తమ్మిరాజు పోగొట్టుకొన్నది నూట పదిరూపాయలున్న సంచి. పాపయ్య శాస్త్రి గారికి దొరికినది నూరు రూపాయల సంచి. దీన్ని బట్టి శాస్త్రులుగారికి దొరికినది షావుకారు పోగొట్టుకున్న సంచీ కాదని తేల్తోంది.

శాస్త్రులు గారూ, ఈ సంచీని మీరు తీసుకుపొండి. నూరు రూపాయల సంచీ పోయిందని ఎవరైనా వస్తే ఇచ్చేద్దురు గాని. తమ్మిరాజూ, వెళ్ళు. నువ్వు పోగొట్టుకున్నానంటున్న ఆ నూట పదిరూపాయల సంచి ఎవరైనా ఎప్పటికైనా తెచ్చి ఇవ్వకపోతారా చూదాం' అని తీర్పు చెప్పేసి కచేరినించి వెళ్ళిపోయాడు.





# విజయమాల

చంద్రగిరి నగరిని చారుదత్తుడు పాలించే రోజుల్లో మంత్రి బుద్ధసాగరుడూ, ఆస్థాన విద్వాంసుడు గుణకీర్తీ ఆయన కెంతో చేదోడువాదోడుగా ఉండేవారు.

ప్రత్యేకించి గుణకీర్తి ఆ తరానికి సాహితీ ప్రతినిధిగా నిలిచేటంత ప్రజారంజక గ్రంధాలు లిఖించాడు.

అయితే ఆయన తన ఏభయ్యవఏట జరిగిన ఓ దుస్సంఘటనలో మరణిం చాడు. గుణకీర్తి స్మారకచిహ్నంగా -- చారుదత్తుడు ఓ శిలావిగ్రహాన్ని ప్రతిష్టిం చాడు.

గుణకీర్తి భార్య ఏనాడో చనిపోతే కొడుకు శ్రుతకీర్తి పొరుగుదేశంలోఉన్న మేనత్త ప్రాపకంలో పెరిగాడు.

ఆమె భర్త కరుణేంద్రుడు అక్కడ సైని కాధికారి. ఆ దేశంలోనే ఉన్న సిద్ధేంద్ర స్వామి గురుకులంలో శ్రుతకీర్తి విద్యా బుద్ధులు నేర్చుకున్నాడు.

గుణకీర్తి తర్వాత ఆయన నిర్వహించిన ఆస్థాన విద్వాంస పదవి, తగిన అభ్యర్థి దొరకక, ఏళ్లపాటు ఖాళీగా ఉండిపో యింది.

మంత్రి బుద్ధిసాగరుడి పరీక్షలకు తట్టు కుని నిలబడే వివేకవంతులెవరూ ఆ రాజ్యంలో ఓ పట్టాన దొరకలేదు.

''ఉయ్యాల్లో పిల్లాణ్ణి పెట్టుకుని వాడి కోసం ఊరంతా వెతుకుతున్నట్టు మనం శ్రుతకీర్తి విషయం పక్కన పెట్టి ఇంకా అతన్ని చిన్నపిల్లాడిగానే పరిగణిస్తున్నాం. ఈపాటికి ఉభయ భాషాప్రవీణ అయి ఉండాలే!,'' అనే చారుదత్తుడి సూచనని మెచ్చుకుని మంత్రి వెంటనే శ్రుతకీర్తిని పిలిపించాడు.

అమరాల రామకృష్ణారావు

ఏ పరీక్షకు గురిచేసినా ప్రథముడిగా నిలిచే అతని తెలివితేటల్ని చూసి బుద్ధి సాగరుడికి నోట మాటరాలేదు.

ఇరవై ఏళ్ళకే అంత పెద్ద పదవా అని ఆస్థానంలో ఎవరేమన్నా లెక్క చెయ్యకుండా రాజు అనుమతి తీసుకుని శ్రుత కీర్తిని వెంటనే ఆస్థాన విద్వాంసుడిగా నియమించాడు.

అలా నిర్ణయించిన సభకి సూచనగా ఓ ఉత్సవం జరిగింది. అతని ఉన్నతికి తోడ్పడిన బంధువులనీ, గురువునీ ప్రత్యేకించి ఆ ఉత్సవ సంరంభానికి చంద్రగిరి నగరిలో కొనసాగుతున్న ఆహ్వానించారు.

ప్రజల హర్షామోదాలు సరేసరి. సంప్రదాయం ప్రకారం శ్రుతకీర్తి విజయహారాన్ని చేత్తో పెట్టుకుని తన ప్రగతికి తోడ్పడిన అతి ముఖ్యవ్యక్తి మెడలో ఆ దండను వెయ్యాలి. ప్రజల్లో తీవ్ర ఉత్కంఠ నెలకొంది. తనని ప్రేమతో పెంచిన మేనత్త మెడలోనా? చేరదీసి విద్యాబుద్ధులు చెప్పించిన కరుణేంద్రుడి మెడలోనా?

తననో భాషా కోవిదుణ్ణి చేసిన సిద్ధేంద్ర స్వామికా ఆ గౌరవం? పిన్నవయసులోనే తనని గుర్తించి రప్పించిన మహారాజుకా? తనలోని ప్రతిభను రుజువు చేసి పెద్దపీట వేసిన మంత్రి బుద్ధి సాగరుడికా?

అయితే అందరి అంచనాలూ వమ్ము చేస్తూ శ్రుతకీర్తి ఆ హారాన్ని శిలావిగ్రహ రూపంలో ఉన్న తండ్రి మెడలో వేశాడు! ఆస్థాన విద్వాంసుడిగా అతని ఎన్నికని మంత్రి సమర్థించిన తీరు ఇదీ:

ఓ వ్యక్తి గొప్పవాడైనందుకు, అలా తోడ్పడిన ప్రతి ఒక్కరికీ కృతజ్ఞత చెప్పుకోవలిసింది. అయితే శ్రుతకీర్తి ప్రతిభకు అందరికన్న ముందు చెప్పుకోవలిసింది జన్మనిచ్చిన గుణకీర్తిని మాత్రమే.

ఓ తరానికి ప్రతినిధిగా నిలబడి ప్రజ్ఞావంతుడైన -- మహాపండితుడి జన్యు సంబంధం కన్న శక్తివంతమైనదేముంటుంది, తనయుడి వ్యక్తిత్వంలో?






# పొట్టి పిచిక కథ

అనగా అనగా ఓ వూర్లో ఒక పొట్టి పిచిక ఉండేది. అదేం చేసిందీ, ఊరల్లా తిరిగి ఉలవగింజ, చేనల్లా తిరిగి సెనగ్గింజ, పెరడల్లా తిరిగి పెసరగింజ, ఇల్లాంటివి ఎన్నో గింజలు పోగు చేసుకొని కొట్టి కొట్టి కొండంత రొట్టి చేసుకుంది.

రొట్టె చేసుకుని, చింత చెట్టుమీద కూర్చుని, ఆ పిచిక ఆ రొట్టెను ఎగరేసుకుంటూ, ఎగరేసుకుంటూ, తింటూ ఉంటే, ఒక చీమ తలకాయంత ముక్క చెట్టు తొ్రలో పడిపోయింది.

అప్పుడా పిచిక ఏం చేసిందీ.. వడ్రంగి దగ్గరకి వెళ్లి, 'వడ్రంగీ, వడ్రంగీ, అతి కష్టపడి కొండంత రొట్టె చేసుకుని తింటూ ఉంటే చీమ తలకాయ అంత ముక్క చింత చెట్టు తొ్రలో పడిపోయింది! చెట్టు కొట్టి అది తీసి పెట్టాలోయ్' అంది.

అందుకు ఆ వడ్రంగి 'చీమ తలకాయంత చిన్న ముక్కకై అంత పెద్ద చెట్టు కొట్టాలా?' అని పకపకా నవ్వాడు.



అప్పుడు ఆ పిచికకు పట్టలేని కోపం వచ్చి తిన్నగా రాజు దగ్గిరకి వెళ్లి, 'రాజుగారూ, రాజుగారూ! అతి కష్టపడి కొండంత రొట్టి చేసుకుని తింటూ ఉంటే చీమ తలకాయ అంత ముక్క చింత చెట్టు తొ్రలో పడిపోయింది. తీసి పెట్టమని వడ్రంగి నడిగితే తీయనన్నాడు. వడ్రంగిని కాస్త దండించు రాజా' అంది.

రాజు కూడా నవ్వి 'ఇంత చిన్న పనికి వడ్రంగిని దండించాలా? దండించను పో' అన్నాడు రాజు.

'అమ్మా వీడిపని ఇలా ఉందా!' అని ఆ పిచిక వెంటనే లేళ్ల దగ్గరకి వెళ్లి

అమరాల రామకృష్ణారావు



జరిగింది చెప్పి, 'చెట్టు కొట్టమంటే వడ్రంగి కొట్ట నన్నాడు. ఆ వడ్రంగిని దండించమంటే రాజు దండించలేదు. రాజుకు ఉద్యానవనమంటే ఎంతో ఇష్టం. అందుకనే దానిని మీరు పాడుచెయ్యండి లేళ్లూ!'' అంది.

'చీమ తలకాయంత రొట్టి ముక్కకి చక్కటి రాజు పూలతోట పాడు చేస్తామా? చాలు, చాలు పో' అన్నాయి లేళ్లు.

'అమ్మ...! వీటమ్మ కడుపు కాలా! ఈ వెధవ లేళ్లకు ఇంత తెగులా!' అని ఆ పిచిక ఏంచేసిందీ అంటే, అది బోయవాడి దగ్గరకి వెళ్లి...

'బోయాడూ.........! బోయాడూ...! చీమ తల కాయంత రొట్టి ముక్క చింత చెట్టు తొర్రలో పడి పోయింది. తియ్యమంటే వడ్రంగి తీశాడు కాడు. వడ్రంగిని దండించమని అడిగితే రాజలా చేయ లేదు. రాజు పూలతోట పాడుచెయ్యమంటే లేళ్లు పాడుచెయ్య లేదు, పోయి లేళ్ల కాళ్లు విరగ్గొట్టు బోయాడూ!'' అంది.

ఇదంతా విని బోయ వాడు, ''ఈపాటి భాగ్యా నికి చెంగు చెంగని గెంతే లేళ్ల కాళ్లను విరక్కొట్టనా? బాగానే ఉంది. వెళ్లు వెళ్లు'' అని పంపేశాడు.

దాంతో పిచిక్కి కోపమె క్కువై ఎలక దగ్గరకు వెళ్లి, ''ఓయ్, ఎలకా! ఎలకా! నాకు ఓ సహాయం చేసి పెట్టాలి. చీమ తలకా యంత రొట్టిముక్క చింత చెట్టు తొర్రలో పడిపోతే తియ్యమంటే వడ్రంగి తీశాడు కాడు. వాడ్ని దండించమంటే రాజలా చేశేడు కాడు. రాజుగారి పూల తోటను పాడు చెయ్యమని అడిగితే లేళ్లలా చేశాయి కాదు. లేళ్ల కాళ్లు విరక్కొట్ట మంటే బోయాడు విర క్కొట్టేడు కాడు. బోయ చెప్పులు కొరికి పాడు చెయ్యి ఎలకా!'' అంది.

ఎలక కూడా ''నా వల్ల కాదు పో''మ్మని అంది.

''అమ్మ.... దొంగ ముండా, నీకెంత గర్వమే! అని పిల్లి దగ్గరకి వెళ్ళి 'పిల్లిబావా! పిల్లిబావా! చీమతలకాయంత రొట్టి ముక్క చెట్టు తొర్రలో పడిపోతే తియ్యమంటే వడ్రంగి తీసేడు కాడు.



వడ్రంగిని దండించమని అడిగితే రాజలా చెయ్యలేదు. రాజు పూలతోట చెరుపమంటే లేళ్లలా చెయ్యలేదు. లేళ్ల కాళ్ళు విరగ్గొట్టమంటే బోయ విరక్కొట్టాడు కాదు. బోయ చెప్పులు కొరకమంటే ఎలక కొరికింది కాదు. ఎలుకను వేటాడు పిల్లీ!'' అంది.

''నాకిప్పుడు చాలా పనులున్నాయి. ఇదేపనా ఏమిటి? అని పిల్లి వెళ్లిపోయింది.

''అయ్యో దీని దర్జా మండా! ఉండు దీని పని పడ్తాను'' అంటూ పిచిక తిన్నగా అవ్వ దగ్గిరకెళ్లి, ''అవ్వా, అవ్వా చీమ తల కాయంత రొట్టిముక్క చింత చెట్టుతొఱ్రలో పడితే వడ్రంగి తీసేడు కాదు. రాజు వడ్రంగిని దండించాడు కాదు. రాజుగారి పూలతోటను లేళ్లు పాడు చెయ్యలేదు. లేళ్ల కాళ్లు బోయ విరక్కొట్ట లేదు. ఎలక బోయ చెప్పులు కొరకలేదు. పిల్లి ఎలకను వేటాడలేదు. పిల్లిమీద వేడి వేడి పాలొయ్యి అవ్వా'' అంది.

''చీమ తలకాయంత రొట్టిముక్క కోసం పిల్లి మీదపాలోస్తానూ? చాలు చాల్లే'' అని అవ్వ కసిరి పొమ్మంది.

''ఏమి తూలిపోతున్నావే! మామ్మా!'' అని పిచిక తిన్నగా తాతయ్య దగ్గిరకి వెళ్ళి, ''చీమ తల కాయంత రొట్టి ముక్క తొఱ్రలో పడిపోతే, వడ్రంగి తియ్యనన్నాడు. రాజు వడ్రంగిని దండించాడు కాదు. లేళ్లు రాజుగారి పూల తోట పాడుచేశాయి



కాదు. లేళ్ల కాళ్లు 'బోయ విరక్కొట్టలేదు. 'బోయ చెప్పులు ఎలక పీకలేదు. అవ్వ పిల్లిమీద వేడి పాలొయ్యలేదు. అవ్వను చితక్కొట్టు తాతా!'' అంది.

''అమ్మో..., నేనలా చేస్తానా! చెయ్యను పో'' అన్నాడు తాత.

''ఓహో...! నీకింత గర్వమా, సరే!'' అని ఆ పిచికేం చేసిందీ, గబగబ ఆవు దగ్గిర కెళ్లి, ''ఆవు పిన్నీ, ఆవుపిన్నీ! చీమ తలకాయంత ముక్క చింతచెట్టు తొఱ్రలో పడిపోతే వడ్రంగి తీసేడు కాడు. రాజు వడ్రంగిని దండించలేదు. రాజు పూలతోట లేళ్లు పాడు



చెయ్యలేదు. లేళ్ల కాళ్లు బోయవాడు విరక్కొట్ట లేదు. బోయ చెప్పులు ఎలక కొరకలేదు. ఎల కను పిల్లి వేటాడలేదు. పిల్లిమీద అవ్వ వేడిపాలో య్యలేదు. తాత అవ్వను చితక్కొట్ట లేదు. తాత పాలు తియ్యడానికొచ్చి నప్పుడు 'ఫెడే'మని తన్ను ఆవూ'' అంది.

''అబ్బెబ్బే, నేనలా చెయ్యను సుమా!'' అంది ఆవు.

అప్పుడు పిచిక విచా రిస్తూ, ''పొద్దున్నే లేచి ఎవరి మొహం చూశానో, ఎవళ్ళ నడిగినా ఏమీ చెయ్యమని అంటున్నారు ఎలాగో!'' అని ఏడుస్తూ కూర్చుంది. ఇంతట్లో ఓ ఈగ ఆ దారమ్మట వెడుతూ ''ఏం పిచికా ఏడుస్తున్నా''వంటే, పిచిక జరిగినదంతా చెప్పి ఉప కారం చేసి పెట్టమంది.

అప్పుడు ఈగ ఏం చేసిందీ, వెంటనే వెళ్లి ఆవు చెవులో దూరి నానా అల్లరి చేసింది. ఆవు ఆ బాధ భరించలేక తాతని తన్నింది. తాతకి పిచ్చి కోపం వచ్చి అవ్వని చితక కొట్టాడు. అవ్వకు వళ్లు మండి పిల్లిమీద వేడి పాలోసింది. పిల్లి కోపం కొలదీ ఒక్కుదుటన ఎలక వెంటపడింది. ఎలక భరించలేక బోయ చెప్పులు కొరికింది. బోయ ఆ కోపం తీర్చుకోడానికి లేళ్ల కాళ్లను విరగకొట్టేడు. లేళ్లు కోపంచేత రాజుగారి తోటను పాడు చేశాయి. రాజుకి బుద్ధి వచ్చి వడ్రంగిని శిక్షించేడు. వడ్రంగి చచ్చినట్టు చింత చెట్టును నరికి, తొర్ర తవ్వి ఆ చీమ తలకాయంత



రొట్టిముక్కనూ, తీసి పిచిక చేతిలో పెట్టేడు.

పిచిక మళ్లీ ఎగరేసు కుంటూ...., ఎగరేసు కుంటూ..... ఆ రొట్టె ముక్కను కమ్మగా తిన్నది.

*(1947 జూలై, తొలి చందమామ సంచికలో ఈ కథ మొదటిసారి ప్రచురితమైనది. 64 ఏళ్ల తర్వాత తిరిగి ఈ కథను ఈ నెల సంచికలో ప్రచురి స్తున్నాము.*

*తొలి చందమామలో తమ తొలి కథ రాసిన శ్రీ అవసరాల రామకృష్ణా రావు గారు ఈనాటికీ సాహిత్య రచనలో చురు కుగా పాల్గొంటున్నారు.*

*ఈ సంచిక కోసం 'విజయమాల' అనే కొత్త కథతో పాటు హృద్యమైన వారి చందమామ జ్ఞాప కాలను కూడా పంపారు. ఈ తొలి చందమామ కథ సజీవ సహజ మూర్తికి చందమామ హృదయ పూర్వక అభినందనలు)*



# తెలియక చేసిన పుణ్యం

పూర్వకాలమందు కాశీనాధుడనే ఒక యతీశ్వరుడు ఉండేవాడు. అతనికి ఇవ్వటమే కాని పుచ్చుకొనటమనేది తెలియదు. ఇలా చేస్తున్నామనే విషయం స్ఫురణ లేకుండానే కాశీనాధుడు రోజూ లోకానికి ఎన్నెన్నో ఉపకారాలు చేస్తూ ఉండేవాడు.

తమకు తెలియకుండానే సూర్య చంద్రులు ఎలా మనకు వెలుగునిస్తున్నారో, ఎటువంటి ప్రతిఫలమూ కోరక పువ్వులు మనకు వాటి పరిమళాలని ఎలా వెదజల్లుతాయో, అలానే కాశీనాధుడు తనకు తెలియకుండానే లోకానికి మంచి చేసేవాడు.

ఈ విధంగా కాశీనాధుడు చేస్తూ వచ్చిన పుణ్యంతో స్వర్గలోకమంతా నిండిపోయింది! ఇది చూచి దేవగణమందరూ ఆశ్చర్యపోయారు ! 'మానవ మాత్రుడేమిటి, ఇంతటి పుణ్యం చేయగలగడమేమిటి? దీని రహస్యమేదో తెలుసుకోవాలి' అని తలచి, దేవదూతలు ఒకనాడు విమానం మీద అతన్ని తమ లోకానికి రప్పించారు.

వారు కాశీనాధునికి సమస్తమైన మర్యాదలూ చేసి. 'మహానుభావా! నీవు చేసిన సుకృతం ఇంతింతకాదు. దీనికిగాను నీవు ఏమి కోరుకుంటే అది నెరవేర్చటానికి సిద్ధంగా వున్నాము,' అని చెప్పారు. వారు ఎన్ని విధాల అడిగినా యతీశ్వరుడు 'నాకేమీ అక్కరలేదు' అని అంటూ వచ్చాడు. -- అప్పుడు దేవదూతలు 'ఏమయ్యా స్వామీ! నీవు నీ చేతులతో

ముద్దా సోమప్పశాస్త్రి

ఎవరిని తాకితే వాళ్ళకు వ్యాధులు నయమై, ఆరోగ్యవంతులయ్యేటట్టు చేయమన్నావా?' అన్నారు. 'వద్దు బాబు! అటువంటి మహిమలు కనబరచటం ఆ సృష్టికర్తకే చెల్లుతుంది కాని, నావంటి మానవమాత్రులకు తగదు,' అంటూ నిరాకరించాడు, కాశీనాధుడు.

'పోనీ. నీకొక ఆకర్షణీయమైన కొత్త స్వరూపం ఇస్తాము. అప్పుడు ప్రజలందరూ నీవద్ద చేరుతారు. వారికి భగవంతుని గురించి బోధచేద్దువుగాని,' అని మళ్ళీ చెప్పారు వారు.

అందుకు కాశీనాధుడు 'వద్దు వద్దు. జనులు నావద్ద చేరటం ప్రారంభిస్తే దేముణ్ణే మరిచిపోతారు. ఐనా దేముణ్ణి గురించి ఒకరు బోధించేదేమిటి ? ఆయన తన సంగతి తనే చూచుకోగలడు!' అని బదులు చెప్పి తప్పించుకోజూశాడు.

'ఐతే - చెడ్డవాళ్ళను మంచివాళ్ళనుగా మార్చే సాధనం ఇస్తాము. దానిని ఉపయోగించావంటే నీకు గొప్ప కీర్తి వస్తుంది. ఏమంటావు?' అని అడిగారు దేవతలు.

'వద్దయ్యా బాబూ ! - ఎక్కడో దేవదూతలు చేయవలసిన ఇటువంటి మహత్తర కార్యాన్ని నన్ను చేయమంటారేమిటి?' అన్నాడు కాశీనాధుడు.

'మహాత్మా ! - మరి, మేము ఏమి ఇస్తామన్నా వద్దంటావే. నీ అంతట నీవే



ఏదైనా కోరుకో,' అని బలవంత పెట్టారు దేవదూతలు.

'నాయనా, పరమేశ్వరుని కృప ఉంటే చాలు. అంతకుమించి నాకేమీ అక్కర లేదు' అని తప్పుకొన్నాడు, కాశీనాధుడు.

'స్వామీ ! నీవు ఇది కావాలి అని కోరుకొనక పోయినట్టయితే, మేమే ఆలోచించి ఏదో ఒకటి నీకు ఇవ్వక తప్పదు,' అని నిష్కర్షగా చెప్పారు దేవదూతలు.

అందుకు కాశీనాధుడు చిరునవ్వుతో 'ఓహో, అలాగా! అయితే, నాకు తెలియకుండానే నేను లోకానికి ఉపకారం చేయగలిగేది ఏదైనా అనుగ్రహించండి,' అన్నాడు.

అతను ఇలా అడిగేసరికి వాళ్ళు కంగారుపడ్డారు. నలుగురూ కలిసి బాగా ఆలోచించి, చివరకు ఒక విచిత్రమైన మహిమను కాశీనాధునికి ప్రసాదించారు. యతి నడిచేటప్పుడు వెనుకవైపులా ఇరు పక్కలా నేలమీద అతని నీడ పడుతుంది కదా! అతనికి అగపడని ఆ నీడ పడినంత మేరా ఒక మహత్తరమైన ప్రభావం కనపడుతుంది. అది యేమిటి అంటే - ఆ నీడ తొక్కినవాళ్ళకు ఎటువంటి వ్యాధులైనా నయమైపోతాయి. మందులకు కుదరని మనోవ్యాధులు కూడా మాయమయిపోతాయి. కాబట్టి విచారాలన్నీ తొలగిపోయి, వాళ్ళు హాయిగా ఉంటారు.

కాశీనాధుడు భూలోకానికి దిగివచ్చి, మామూలుగా తనదారిని తను నడిచి పోతూ వుంటే - అతని నీడ పడినంతమేర లోనూ బీళ్ళు పచ్చబడేవి, మోళ్ళు చిగిర్చేవి, ఎండి పోయిన వాగులు స్వచ్ఛమైన జలంతో నిండిపోయేవి, పాలిపోయి కృశించివున్న శిశువులు ఒక్క లిప్తలో తేరుకుని, ఆరోగ్యవంతులై, నవనవలాడుతూ ఉండేవాళ్ళు. ఇలా తమ బిడ్డలలో కలిగిన మార్పు చూసి, వారిని కన్న తల్లులు పొంగిపోయేవాళ్ళు.

లోకంలో ఇంతపని జరుగుతూవుంటే ఈ సంగతి కాస్తంతైనా కాశీనాధునికి తెలియనే తెలియదు. తన నీడలో ఇంత మహత్తు ఉన్నట్టూ, ఆ మహిమవల్ల లోకానికి గొప్ప ఉపకారం జరుగుతున్నట్టూ కాశీనాధుడు ఎరుగనే యెరుగడు. ఇదే దేవదూతలు చేసిన చిత్రం.

ప్రజలు ఏనాడైతే అతని నీడలోని మహిమను గుర్తించారో అప్పటినించీ - చడీ చప్పుడూ చేయకుండా, యతీశ్వరుణ్ణి మెల్లగా వెంబడించి, అతని నీడ పడిన ప్రదేశంలో ప్రవేశించి, ఎవరికి కావలసిన సౌఖ్యాలు వారు పొందుతూండేవాళ్ళు.



# కెరీర్ అంటే?

ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షలు యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పర్యవేక్షణలో నిర్వహించబడతాయి. ఈ పరీక్ష రెండు దశలుగా విభజించబడుతుంది:

1. ప్రిలిమినరీ పరీక్ష
2. మెయిన్ పరీక్ష

ప్రిలిమినరీ పరీక్ష ఒక అర్హతా పరీక్ష. ఇది సహజంగా ఆబ్జెక్టివ్ రూపంలో ఉంటుంది. దీంట్లో రెండు పేపర్లు ఉంటాయి. ఒకటి అభ్యర్థి సాధారణ జ్ఞానాన్ని పరీక్షిస్తే రెండోది అభ్యర్థి ఎంచుకున్న సబ్జెక్టును పరీక్షిస్తుంది.



మెయిన్ పరీక్ష రాత, మౌఖిక విభాగాలుగా విభజించబడుతుంది. రాత పరీక్షలో మొత్తం 9 ప్రశ్నా పత్రాలు ఉంటాయి. ఇంగ్లీషుపై ఒక ప్రశ్నాపత్రం, ఏదైనా భారతీయ భాషపై ఒక ప్రశ్నాపత్రం, లోకజ్ఞానంపై ఒక ప్రశ్నాపత్రం, ఒక వ్యాసం మరియు పరీక్షకు హాజరవుతున్న అభ్యర్థి ఎంచుకున్న ఏవైనా రెండు ఐచ్ఛిక అంశాలపై ప్రశ్నాపత్రాలు ఉంటాయి.

సివిల్ సర్వీస్‌కి సిద్ధమవుతున్న అభ్యర్థి ఈ రెండు దశలను పూర్తి చేసిన తరవాత అతడు లేదా ఆమె ఇంటర్వ్యూకు హాజరవుతారు. ఇంటర్వ్యూలో లోకజ్ఞానంకి సంబంధించిన ప్రశ్నలను అభ్యర్థి ఎదుర్కోవలసి ఉంటుంది. అయితే ఇంటర్వ్యూ యొక్క ప్రధాన లక్ష్యం అభ్యర్థి వ్యక్తిత్వాన్ని అంచనా వేయడం, అతడు లేదా ఆమె తాను చేపట్టే పదవీ బాధ్యతలకు అర్హులా కాదా అని నిర్ణయించడం దిశలో ఉంటుంది. చివరగా వైద్య పరీక్షలో ఉత్తీర్ణుడు కావలసి ఉంటుంది. ఇది ఇండియన్ పోలీస్ సర్వీస్‌లో చేరనున్న అభ్యర్థులకు ముఖ్యమైన అర్హతగా ఉంటుంది.

ఈ సమాచారం మీకు ఉపయోగకరంగా ఉంటుందనే భావిస్తున్నాను. - సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 30

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -30 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఆగస్ట్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. అక్టోబర్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## యూదుమతం



1. యూదుమతం సంస్థాపకుడు ఎవరు?
2. యూదుమతం చిహ్నం ఏది?
3. టోరాలో ఎన్ని కమాండ్‌మెంట్స్ ఉన్నాయి?
4. జెఇ72డబ్ల్యుఎస్ పవిత్ర భాష ఏది?
5. అబ్రహాం కథను కలిగి ఉన్న పుస్తకం ఏది?
6. యూదుల ఆహారం పేరేమిటి?
7. ఏ పనీ చేయనప్పుడు యూదులందరూ సెలవుదినంగా పాటించే దినం ఏది?
8. యూదుమతం ఎప్పుడు, ఎక్కడ పుట్టింది?
9. రోష్ హషానాహ్ అంటే ఏమిటి?

**చందమామ లోకజ్ఞానం క్విజ్-27 ఏప్రిల్ 2011 సమాధానాలు**

1. పార్శీల నూతన సంవత్సరాది 2. మహావీరుడు 3. మాగధి 4. చిదంబరం 5. మొట్టమొదటి అయిదు మంది ప్రియతమ స్వచ్ఛంద సేవకులు - భాయి దయా సింగ్ జీ, భాయి ధరమ్‌సింగ్ జీ, భాయి మోకమ్ సిం జీ, భాయి హిమ్మత్ సింగ్ జీ మరియు భాయి సాహెబ్ సింగ్ జీ. 6. సింహం 7. కైలాస పర్వతం

ఏప్రిల్'11 నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.



# నవ్వుల పువ్వులు



సోదెకత్తె: నీ రేఖలు చాలా ప్రత్యేకంగా ఉన్నాయి.
మహిళ: చూడు. నా అదృష్టం ఎలా ఉందో చెప్పించుకోడానికి ఇక్కడికి వచ్చాను గాని నా రేఖల గురించి ఎత్తిచూపించుకోవడానికి కాదు.



క్రీడాకారుడు: నా నాడి ఎంత ఎక్కువగా కొట్టుకుంటోంది డాక్టర్?
డాక్టర్: నూట ఒకటి
క్రీడాకారుడు: ప్రపంచ రికార్డు ఎంత?



టీచర్‌తో పాపాయి: తను రోజంతా అక్కడే కూర్చుని ఉంటాడండీ, చేసే పనేమీ లేదు కాని, తన సమయాన్ని వృథా చేస్తుంటాడు.
టీచర్: నీకెలా తెలుసు?
పాపాయి: నేను అతడినే చూస్తూ ఉంటా మరి!



రాజు: మా మామయ్య అమెరికానుంచి తిరిగొచ్చాడు. మన గడ్డమీద అడుగు పెట్టగానే అతడు కింద పడి నేలను ముద్దుపెట్టుకున్నాడ్రా!
వంశీ: దేశభక్తి భావంతో కదిలిపోయి ఉంటాడేమో కదరా!
రాజు: లేదురా. అరటి తొక్కపై కాలేశాడు.

రాజ ఫలహారం

# పిజ్జా బాట





డేరియస్ చక్రవర్తి (521-486 బి.సి), అతడి సైనికులు భూభాగాలు గెలుచుకోవడానికి సుదీర్ఘ ప్రయాణాలు చేయవలసి వచ్చింది. వారు తమ కవచాలపై ఒకరకం బ్రెడ్‌ని తయారుచేసుకుని దాని పైన వెన్న, ఎండుద్రాక్షలను అమర్చేవారు. ఇది వారికి సత్వరం జీర్ణమయ్యే మెత్తటి స్నాక్‌లా ఉపయోగపడేది!



రోమన్ కవులు, చరిత్రకారులు రోమన్ సామ్రాజ్య వైభవోజ్వల చరిత్రను రాసేటప్పుడు, పిజ్జాల గురించి రాయడం మర్చిపోయేవారు కాదు. క్యాటో మరియు కవి విర్గిల రచనల్లో పిజ్జా గురించి వర్ణించబడింది. మార్కస్ అపికస్ రచించిన ఒక వంటల పుస్తకంలో పిజ్జా వంటకం గురించి రాశారు.



యూరప్‌లో టమేటోలను ప్రవేశపెట్టినప్పుడు, ప్రజలు వణికిపోయారు, ఎందుకంటే టమేటోలు విషఫలాలు అని వారు తలచారు. కాని తర్వాత్త ర్వాత ప్రజలు సాహసించి పిజ్జా తయారీలో వాడే అనుబంధ పదార్థాలలో టమేటోలను కలిపేవారు.



మొజ్జారెల్లా వెన్నను చాలా ఎక్కువగా వంటకాలపై పూతగా ఉపయోగిస్తుంటారు. దీన్ని 17వ శతాబ్దిలో మొట్టమొదటగా భారతీయ గేదె పాల నుంచి తయారు చేసేవారు. పిజ్జా పూతల విషయానికి వస్తే, భారతీయ శైలి చాలా విశిష్టమైంది. ఊరబెట్టిన అల్లం, పన్నీరు, తండూరీ చికెన్, టిక్కా, చిన్న సైజు ముక్కలుగా చేసిన మటన్ వంటివి భారత్‌లో పేరు గాంచాయి.



రైతుల ఆహారంగా గుర్తించబడి, ప్రతి ఒక్కరికీ అభిమాన వంటకంగా నిలిచిపోయిన వంటకం ఏది! నేపుల్స్ రాణి మేరియో కరోలినా సమ్మర ప్యాలెస్‌లో ప్రత్యేకంగా ఓవెన్ తయారు చేయించేదట. దాంతో రాణి వంటవాడు ఆమె అతిథులకు పిజ్జాలను తయారు చేసి వడ్డించేవాడు.

18వ శతాబ్దివరకు పిజ్జాలను మార్కెట్ స్టాళ్లలో మాత్రమే అమ్మేవారు. 1830లో, అంటికా పిజ్జెరియా పోర్ట అల్బా అనే పేరుతో మొట్టమొదటి పిజ్జా రెస్టారెంట్‌ను నేపుల్స్‌లో ప్రారంభించారు. విసూవియస్ అగ్ని పర్వతం నుంచి ప్రవహించే శిలాద్రవం, లావాపై ఓవెన్‌ని ఉంచి పిజ్జాలను తయారు చేసేవారు. అత్యధిక ఉష్ణోగ్రతల వద్ద కాల్చిన పిజ్జాలు చాలా ఉత్తమంగా ఉండేవి.






1889లో ఇటలీ రాణి గౌరవార్థం నెపోలియన్ ప్రధాన వంటగాడు సవాయ ప్రాంతానికి చెందిన మార్కెరిటా... టమేటో, మోజ్జారెల్లా వెన్న, బసిల్‌ల పూతతో కూడిన పిజ్జాను తయారు చేసేవాడు. ఇటాలియన్ పతాకం రంగులను సూచించేందుకు ఇలా చేసేవారు. పిజ్జా మార్గెరిటా అనేది అవిధంగా ఉనికిలోకి వచ్చింది.



పిజ్జా మారినేరియా అనేది మరొక సుప్రసిద్ధ ఇటాలియన పిజ్జా. సముద్ర చేపలను పైభాగంలో కలిగి ఉంటుంది కాబట్టి దీన్ని మేరినారియా అని పిలవలేదు కాని, బే ఆఫ్ నేపుల్స్‌లో చేపలు పట్టి తీరంవైపు వచ్చే సందర్భంలో జాలర్లు చేసుకుని తింటారు కాబట్టి దానికాపేరు వచ్చింది.





ఫ్రెంచ్ రచయిత అలెగ్జాండర్ డ్యుమాస్ తను రాసిన లే కొర్రికోలో రచనలో పిజ్జాల గురించి రాశాడు. అయితే ఎబట్టో అనే పిజ్జాను దాన్ని తయారు చేసిన వారం రోజుల తర్వాత తింటారని రాయడం డ్యుమాస్ రచనలో పెద్ద లోపంగా మిగిలిపోయింది. వాస్తవం ఏమిటంటే ఆరోజుల్లో పిజ్జా ఎ ఒట్టో అనే రకం పిజ్జా ఉండేది. దీన్ని తిన్న వారం రోజుల తర్వాత మీరు డబ్బు చెల్లించవచ్చు.



19వ శతాబ్ది చివరలో ఇటాలియన్ వలసప్రజలు యునైటెడ్ స్టేట్స్‌లో పిజ్జాలను ప్రవేశపెట్టారు. విక్రయదారులు పెద్ద సైజు లోహ తొట్లలో పిజ్జాలను పెట్టుకుని తిరుగుతూ ఒక్కొక్క ముక్కను 2 సెంట్లకు అమ్మేవారు. పిజ్జాలు వేడిగా ఉండటానికి లోహ తొట్ల కింది భాగంలో కాలుతున్న బొగ్గు ముక్కలను ఉంచేవారు.



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I am very busy these days. | Where were you all these days ? |
|---|---|---|
| Telugu | కొన్నాళ్లుగా తీరిక లేకుండా ఉన్నాను. | ఇన్నాళ్లూ ఎక్కడున్నారు? |
| Hindi | मैं आजकल बहुत व्यस्त हूँ।<br>మై ఆజ్కల్ బహుత్ వ్యస్త్ హూన్ | तुम इतने दिनों से कहाँ थे?<br>తుమ్ ఇటానె దినో సె కహాన్ థె? |
| Tamil | இப்போது எனக்கு நிறைய வேலை இருக்கிறது.<br>ఇప్పోదు ఎనక్కు నిరయా వేళయ్ ఇరుక్కిరుదు | இத்தனை நாட்களாய் நீ எங்கிருந்தாய்?<br>ఇత్తనై నట్కాలై నీ ఎంగిరుందయ్? |
| Bengali | আমি আজকাল খুব ব্যস্ত আছি ।<br>ఆమి ఆజ్కల్ ఖుబ్ బైస్తో ఆచ్చి. | আপনি এতদিন কোথায় ছিলেন?<br>ఆప్ని ఎతోదిన్ కొథాయ్ ఛిలెన్? |
| Marathi | या दिवसांत मी खूप व्यस्त आहे.<br>యా దివసత్ మి ఖూప్ వ్యస్టా అహె. | या दिवसांत तुम्ही कुठे होतात?<br>యా దివసత్ తుమ్హి కుథె హోతా? |
| Kannada | ಇತ್ತೀಚೆಗೆ ನಾನು ತುಂಬಾ ಬ್ಯುಸಿ<br>ఇట్టేచేగె నాను తుంబా బిజీ. | ಇಷ್ಟು ದಿನ ನೀವು ಎಲ್ಲಿದ್ದಿರಿ?<br>ఇష్టు దిన నీవు ఎల్లిద్దిరి? |
| Oriya | ମୁଁ ଆଜିକାଲି ଭାରି ବ୍ୟସ୍ତ ରହୁଛି।<br>మున్ ఆజికాలి భారి బ్యస్త రహుచ్చి. | ତୁମେ ଏହି ଦିନଗୁଡ଼ିକରେ କେଉଁଠାରେ ଥିଲ?<br>తుమె ఎహి దినాంగుడికరే క్యూన్థారె థిలా? |
| Gujarati | હું કેટલાક દિવસોથી ખૂબ વ્યસ્ત છું.<br>హన్ కె టాలాక దివసోథీ ఖూబా వ్యస్త చ్చు. | તમે આટલા દિવસથી ક્યાં હતા?<br>టమె ఆటాలా దివసతథీ క్యాన్ హాటా? |
| Assamese | আজিকালি মই বৰ ব্যস্ত।<br>ఆజ్కల్ మోయ్ బోర్ బైస్టా. | আপুনি ইমান দিনে ক'ত আছিল?<br>ఆపుని ఇమానా దిన కోటె ఆసిల్? |
| Malayalam | ഞാൻ ഈയിടെ വല്ലാത്ത തിരക്കിലാണ്<br>న్యాన్ ఏయిడి వల్లథ థిరక్కిలను. | നിങ്ങൾ ഇത്രയും ദിവസം എവിടെയായിരുന്നു?<br>న్యాంగల్ ఇతరుయమ్ దివసమ్ ఎవిడెయాయిరున్ను? |
| Santali | ᱱᱚᱣᱟ ᱠᱚ ᱫᱤᱱ ᱨᱮᱰᱚ ᱟᱰᱤᱝ ᱵᱤᱰᱩᱜ-ᱟ।<br>నోవ కో దిన్ రెడో ఆదిఙ్ బిడుగ్ ఆ. | ᱱᱚᱣᱟ ᱠᱚ ᱫᱤᱱ ᱨᱮᱰᱚ ᱟᱯᱮ ᱚᱠᱟᱨᱮ?<br>నోవా కో దిన్ రెడో ఆపే ఒకరే. |
| Sanskrit | एषु दिनेषु अहं बहु व्यस्तः।<br>ఎషు దినేషు అహమ్ బహు వ్యస్తాహః | एतावन्ति दिनानि कुत्र आसीत् भवान्?<br>ఎటావంతి దినాని కుత్ర ఆసీత్ భావన్? |





| English | I thought of you yesterday. | I had gone to Simla. |
|---|---|---|
| Telugu | నిన్న మిమ్మల్ని తలచుకున్నాను. | నేను సిమ్లా వెళ్లాను. |
| Hindi | मैंने कल तुम्हारे बारे में सोचा था।<br>మైనె కాల్ తుంహారే బారే మె సోచాథా. | मैं शिमला गया था।<br>మైన్ షిమ్లా గయా థా. |
| Tamil | நான் நேற்று உன்னைப்பற்றி நினைத்தேன்.<br>నాన్ నేట్రు ఉన్నైపత్రి నినైథానె. | நான் சிம்லா சென்றிருந்தேன்.<br>నాన్ సిమ్లా చెంద్రిరుంథానె. |
| Bengali | আমি গতকাল আপনার কথা ভাবছিলাম ।<br>ఆమి గటోకాల్ ఆప్నార్ కథా భాబ్‌ఛిల్లామ్. | আমি সিমলা গিয়েছিলাম ।<br>ఆమి షిమ్లా గియచ్ఛిల్లామ్. |
| Marathi | मी काल तुझा विचार करत होतो/होते.<br>మి కాల్ టుజా విచార్ కరత్ హోతో/హోతె. | मी सिमल्याला गेलो/गेले होते.<br>మి సిమ్లాయల గెలో/గెలె హోతో. |
| Kannada | ನಾನು ನಿನ್ನೆಯಷ್ಟೇ ನಿಮ್ಮನ್ನು ನೆನಪಿಸಿಕೊಂಡೆ.<br>నాను  నిన్నెయష్ట్యే నిమ్మన్ను నెనపిసికొండె. | ನಾನು ಶಿಮ್ಲಾಕ್ಕೆ ಹೋಗಿದ್ದೆ.<br>నాను షిమ్లాక్కె హోగిద్దె |
| Oriya | ମୁଁ କାଲି ତୁମ କଥା ଭାବୁଥିଲି।<br>ముున్ కలి టుమా కథా భాబుథిలి. | ମୁଁ ସିମ୍ଲା ଯାଇଥିଲି।<br>ముున్ సిమ్లా జాయిథిలి. |
| Gujarati | મેં કાલે જ તમને યાદ કર્યા હતા.<br>మెన్ కాలె జా టమానె యాడా కార్యా హాటా. | હું શિમલા ગયો હતો/ગઈ હતી.<br>హున్ షిమ్లా గయో బటో/గయ్ హాటే. |
| Assamese | মই কালি আপোনাৰ কথা ভাবিছিলো।<br>మోయ్ కాలి ఆపునార్ కథా భాబిసిలు. | মই ছিমলালৈ গৈছিলো।<br>మోయ్ షిమ్లా-లోయ్ గోసిలు. |
| Malayalam | ഞാൻ ഇന്നലെ നിങ്ങളുടെ കാര്യം ഓർത്തു<br>న్యాన్ ఇన్నాలె నింగులుడె కార్యమ్ ఒర్థు | ഞാൻ സിംലയിൽ പോയിരുന്നു<br>న్యాన్ సిమ్లాయలి పోయిరున్ను. |
| Santali | ᱦᱚᱞᱟᱝ ᱩᱦᱟᱹᱨ ᱠᱮᱫ ᱢᱮᱭᱟ।<br>హోలాంజ్ ఉహార్ కెడ్ మెయా. | ᱥᱤᱢᱞᱟᱝ ᱪᱟᱞᱟᱣ ᱞᱮᱱᱟ।<br>సిమ్లాంజ్ చాలావ్ లేనా. |
| Sanskrit | ह्य:अहं भवन्तं स्मृतवान्।<br>హ్యహ అహమ్ భవంతమ్ స్మృతవాన్. | अहं शिमलानगरं गतवान् आसम्।<br>అహమ్ సిమ్లా నగరం గతవాన్ ఆసమ్ |

# వేయించిన గింజలు మొలకెత్తేటప్పుడు...



రావణ ప్రహారంచేత నేలకూలి ప్రాణాలు విడిచే ముందు జటాయువు తనకు అంత్యక్రియలు నిర్వహించమని రాముడిని అభ్యర్థించాడు. రాముడందుకు అంగీకరించాడు.

జటాయువుకు అంత్యక్రియలు నిర్వహించిన చోటు 'తిరుపుట్కుళి'. ఇది చెన్నయ్ నగరానికి 80 కి.మీ దూరంలో ఉంది. ఇక్కడ కొలువై ఉన్న దేవుడి పేరు విజయరాఘవన్. ఇతడు జటాయువును తన చేతుల్లో పొదవుకుని కనిపిస్తాడు. లక్ష్మీదేవి ఇక్కడ మరకతవల్లి అని పిలువబడుతుంది.

పిల్లలకోసం బాధపడుతున్న వారి కోరికలను ఇక్కడి దేవత తీరుస్తుందని నమ్మకం. దేవత ఆశీర్వాదం కోసం మహిళలు ఇక్కడి గుడికి వస్తుంటారు. ఇక్కడి దేవతను ప్రార్థించి ఆలయం నుంచి ఒక సంచిలో వేయించిన గింజలను తీసుకుని దాన్ని తమ కడుపుకు కట్టివేసి గ్రామంలో ఒక రాత్రంతా గడుపుతారు. మరుసటి రోజు ఉదయం ఆ వేయించిన గింజలు మొలకెత్తి ఉండటాన్ని వారు చూసినట్లయితే, వారిని దేవత కరుణించినట్లు లెక్క. వీరికి త్వరలోనే పిల్లలు కూడా పుడతారని ఇక్కడి వారి విశ్వాసం.

# నాలుక తెగ్గోసే ఆచారం

దేవుడికి మొక్కులు తీర్చడం భారత్‌లో అనాదిగా వస్తున్న ఆచారం. దేవుడికి తమ నాలుకలను సమర్పించడం అనేది మధ్యయుగాల్లో బలీయమైన ఆచారంగా ఉండేది. 17వ శతాబ్దం నాటి కథలను చూసినట్లైతే, నాగర్‌కోట్‌లో దుర్గాదేవికి చెందిన సుప్రసిద్ధమైన ఆలయం ఉండేది. ఇది కఠ్మాండుకు 32 కిమీ. తూర్పున నెలకొని ఉంది. ఇక్కడ దేవతకు సమర్పించేవాటిలో మనుషుల నాలికల ముక్కలు చాలా ముఖ్యమైనవి. దేవతకు ఎవరైనా తమ నాలుకను అర్పించినట్లయితే మరుసటి దినం వారి నాలుక యధావిధిగా నోటిలో ఉంటుందని ప్రజల నమ్మిక. ఇలా నాలుకను దేవతకు బలి ఇచ్చే అలవాటు కర్నాటకలో కూడా జరుగుతోందట. వీటికి తోడుగా, మొఘలులు కూడా ఈ ఆచారాన్ని పాటించేవారు కాని శిక్ష రూపంలో పాటించేవారు.



# ఆకులతో పజిల్ - కనుక్కోండి చూద్దాం

మా చిత్రకారుడు ఈ కింది పజిల్‌ను ఆకులతో రూపొందించాడు. వీటి ఆధారంగా మీరు: ఎ. అసలు చిత్రం నుంచి జిగ్‌సా ముక్కలను సరిపోల్చడం బి. చిత్రంలో దాగి ఉన్న జంతువులను కనుగొని వాటి జాబితాను రూపొందించడం చేస్తారా?









## విదూషకుడు

### బీర్బల్



# పెద్ద బహుమతి



1. ఒకరోజు, ఇద్దరు సంగీత విద్వాంసులు అక్బర్ చక్రవర్తి దర్బారుకు వచ్చి అద్భుత గీతాలు పాడారు.



2. చక్రవర్తి సంతోషంతో, 'అద్భుతం! మీరు పెద్ద బహుమానానికి అర్హులు. మీకిద్దరికీ మేం చెరొక ఏనుగును బహూకరించెదము.'



3. 'అయ్యో దేవుడా, ఏనుగును మేమెలా భరించగలం? కాని, చక్రవర్తి ఇచ్చే బహుమతిని ఎలా వ్యతిరేకించగలం?' అని వారిలో ఒకరు అన్నారు.



4. వారు మారుమాటాడకుండా ఏనుగులతో వెళ్ళిపోయారు. కొద్ది రోజుల్లోనే, ఏనుగులను పోషించలేక వాళ్లు దివాళా తీశారు.



5. చివరకు వారిద్దరూ బీర్బల్‌ను కలుసుకుని సాయం చేయవలసిందిగా కోరారు. 'నేను చెప్పింది పాటించండి చాలు!' అన్నాడు బీర్బల్.



6. ఏనుగులకు ఒక రోజంతా తిండి పెట్టకుండా మాడ్చారు. వాటికి పిచ్చెత్తిపోయి వీధుల వెంబడి పరుగులు తీశాయి. జనం భయపడిపోయారు.



7. అగ్రహోదగ్రుడైన చక్రవర్తి సంగీత విద్వాంసులను దర్బారుకు పిలిపించాడు. 'నేను బహుమతిగా ఇచ్చిన ఏనుగులను మీరిలాగేనా చూసుకునేది?'



8. 'జహాపనా! వీధుల్లో పాడి, అడుక్కోవడం ద్వారా తమ బతుకు తాము చూసుకోగలమని ఏనుగులే మాకు చెప్పాయండీ.'



9. వారికి అలాంటి ఆలోచన ఇచ్చింది బీర్బలే అని చక్రవర్తి గ్రహించాడు. 'మిమ్మల్ని నా ఆస్థాన విద్వాంసులుగా నియమిస్తాను సరేనా!' అన్నాడు.

ఏప్రిల్'11 సుడోకు పజిల్‌కి సరైన సమాధానం ఇక్కడ చూడండి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 1 | 9 | 6 | 3 | 7 | 4 | 2 | 5 |
| 3 | 2 | 6 | 9 | 4 | 5 | 7 | 8 | 1 |
| 7 | 5 | 4 | 1 | 2 | 8 | 3 | 9 | 6 |
| 9 | 4 | 7 | 8 | 5 | 3 | 6 | 1 | 2 |
| 2 | 8 | 1 | 4 | 6 | 9 | 5 | 3 | 7 |
| 6 | 3 | 5 | 7 | 1 | 2 | 9 | 4 | 8 |
| 5 | 6 | 8 | 2 | 9 | 4 | 1 | 7 | 3 |
| 1 | 9 | 2 | 3 | 7 | 6 | 8 | 5 | 4 |
| 4 | 7 | 3 | 5 | 8 | 1 | 2 | 6 | 9 |

## April'11 Winners

1. Sohan Lal Agarwal
   Kalahandi(Dist), Odisha - 416012.
2. Sabita Murmu
   Karandih, Jamshepur - 831002.
3. Sagar Rameshbhai Bhimani
   Anand(Dist), Gujarat - 388620.
4. R. Shravan Kumar
   Sheshadripuram, Banglore - 560003.
5. C.V.R. Dharma
   Kurnool, Andhrapradesh - 518002.

# ఎలెక్ట్రానిక్ చిత్రాలు

ఎలక్ట్రిక్, ఎలక్ట్రానిక్ వస్తువులపై ఈ నెల ఆల్బమ్



టెలివిజన్



ల్యాప్‌టాప్



సెల్‌ఫోన్



కెమెరా



రేడియో



ఇస్త్రీ పెట్టె



Chandamama

# Art Book

I cannot express the feelings I went through as I turned the pages of the Art book. These illustrations are an invaluable gift from the great artists of Chandamama. As I browsed through the pages, it took me for a memorable trip through the world of colors and opened up magical worlds of fantasy. This book left me longing for more. Every Chandamama reader's family should have this particular book for a keepsake. The price of the Artbook is very little compared to the joy it gives. Get it now and start your journey to a world filled with moon light.

*- N. Siva Nageswara Rao, Tenali.*

Order Now

2 Volumes

M.T.V.Acharya

₹ 1500/-

Log on to: **www.chandamama.com** or Contact: Chandamama India Ltd.
B3, Cross Road 'B', MIDC, Andheri(E), Mumbai-400093. Ph. No: 022 28312872/28311849

CHANDAMAMA (Telugu) July 2011 Registrar of Newspapers of India No. MAHTEL/2010/35912
Licensed to post regd. No. MH/MR/N/126/MBI/10-12